# ఆద్యంతాలు

(నాలుగు నాటికలు)

అద్యంతాలు — వాగ్దానము

అపశ్రుతి — శాస్త్రి


విద్వాన్

## సహదేవ సూర్యప్రకాశరావు

ప్రధానాంధ్రోపాధ్యాయుడు

పురపాలక సంఘోన్నత పాఠశాల

రాజమహేంద్రవరము



ప్రకాశకులు

## శ్రీ పులిచెట్టి రామకృష్ణ

కోడూరు (కడపజిల్లా)

ప్రథమముద్రణ వికారి





వెల రు. 1-50

# రెండు మాటలు

నేడు తెనుగునాడులో ఔత్సాహిక నాటక సదస్సులు తామర తంపర. వానితో నాటక నాటికలు హెచ్చు పెరిగాయి. నాటకకళోద్యమం తెలుగు నేలలో పరివ్యాప్తమై మహత్తర చరిత్రను సృష్టింపబోతున్నట్లు స్ఫురిస్తున్నది. శుభం.

మంచి నాటకాన్ని తిలకించే కుతూహలాన్ని రేకెత్తించి, మంచి అభిరుచులకు ప్రజాహృదయాన్ని దోహదంచేయాలి నాటక పరిషత్తులు. అప్పుడు తెనుగుదనం తీయమువారే నాటకాలు కావలసివస్తవి. నిత్యజీవితంలో నిరంతరాయంగా నెలకొనే సమస్యల్ని యథాతథంగా చిత్రించి ప్రతిపాత్రలో తాను అవశేషమైనా ప్రతిధ్వనిస్తున్నాడనే, ప్రతిబింబిస్తున్నాడనే భావాన్ని సదస్యుల హృదయాల్లో హత్తించి, ప్రజ్వలింపచేసి జీవితరంగములో అభ్యుదయమార్గాల పురోగమించడానికి దారులుతీయాలి నాటక కవి. అప్పుడు నాటక ధర్మానికి లోకధర్మానికి కించిద్భేదం ఉన్నా పరిగణింప నవసరంలేదు.

ఈనాళ్లలో నాటికలమీద మమత హెచ్చు. అందుకే నాటికకు బహుళ ప్రచారం. నాటిక కథానికవలె విలక్షణం గలది. భిన్నతత్త్వం గలది. అది ప్రత్యేక కళాఖండిక. నాటక రచనకన్నా నాటిక రచన జటిలం. ఒకానొక సన్నివేశాన్ని ఒకానొక భావాన్ని - తీసికొని నాటికను నడిపిస్తూ వైవిధ్యమయిన సంఘర్షణలచే పాత్రోన్మీలనంచేస్తూ ఆద్యంతాలు ప్రేక్షకుణ్ణి ఆకట్టాలి. అప్పుడే నాటిక పరాకాష్ఠచెందుతుంది. అప్పుడే నాటిక ప్రయోజనం సిద్ధిస్తుంది.

ఈ భావాలన్నీ మనసులో ఉంచుకొని ఈ నాటికల్ని వ్రాయయత్నించాను. ఇందలి తొలినాటిక ఒక నటక మిత్రుడు సూచించిన కథాలేశ మాధారంగా వ్రాసింది. కార్యవ్యగ్రతలోనున్నా, కలకబారిన మనస్సుతోనున్నా నామాట త్రోసివేయక భూమిక వ్రాసియిచ్చిన డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారికి నమోవాకములు. ముఖాలేఖ్యాన్ని రూపించి యిచ్చిన శిష్యుడు చిత్రకారుడు చి॥ అ. ధర్మారావునకు శుభాశీస్సులు.

స. సూర్యప్రకాశరావు

గమనిక: ఈ నాటికలను ప్రదర్శింపదలచినవారు రచయిత అనుమతిపొందవలె.

# భూమిక

సహదేవ సూర్యప్రకాశరావు గారిని "మునిమాపు" "వకుళమాల" రచయితగా ఆంధ్రలోకము ఎరుగును. ఈ "నాటికా సంపుటి"తో వారిని నాటికా రచయితగా ఎరుగనున్నది. "ఆరాధన" అనే పేరుతో కథానికలనుకూడా కొన్నిటిని వారు రచించారు. వారి కవిహృదయము సున్నితమైన దన్నట్లు వాటిలోని మాటల పోహళింపూ భావాల మార్దవమూ వెల్లడిచేస్తాయి. నాటికలలోకూడా కవిత్వపు పరిమళమే గుబాళించవచ్చును. కాని దృశ్యనాటికలలో, వినోదమూ. కథావైచిత్రీ సందేశమూ లేకుంటే అవి రాణించడమూ కష్టము. ఈ నాటికల కథావైచిత్రీ వినోద సౌందర్యమూ. హితైషి సందేశమూ వీటిని చిరకాలము మెరపించగలవు.

ఆధునిక నాగరక జీవనములో ఆదర్శపు శాలువాలు కప్పుకొని ప్రవేశిస్తూన్న ఛద్మప్రేమా, పారదారిక ప్రేమా, మద్యపానమూ, ఇతివృత్తాలు ఈ నాటికలకు. తారుణ్యవతియైన స్త్రీ "నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను." అన్న యువకునిచేత కీలుబొమ్మలా ఆడుతుంది. మనస్సుకు కలిగిన గాయాన్ని మాన్పుకోడానికైనా సరే అలవాటు చేసుకున్న మద్యము మానవుణ్ణి నరకానికి దింపి నెత్తిమీద తాండవము చేస్తుంది. అన్న సత్యాలు 'శాన్తి', 'అపశ్రుతి', 'వాగ్దానం' అన్న నాటికలలో సూత్రప్రాయంగా కనపడతాయి. 'ఆద్యంతాలు' భవిష్యత్తులోనికి సాగిన చూపు. స్వాతంత్ర్యమువల్ల సాంఘిక నియమాల్నికూడా అతిక్రమించిపోతారు యువకులు. జీవులకు సామాన్యమైన స్వార్థము స్వాతంత్ర్యము తెచ్చిన నిర్భీతితో చేరితే వచ్చే పరిణామాలు మనకు విచిత్రముగానే వుంటాయని చూపిస్తుంది 'ఆద్యంతాలు'.

నాటిక అన్నది కేవలము లోకవృత్తానుకరణముగా ఉండజాలదు. దాని ఆవరణ చాలా చిన్నది. ప్రయోగనియమము — ఒకే రంగమును నిర్మించడముతో ప్రదర్శనము పూర్తి అయిపోవాలి అన్నది. — కవి ఊహా క్షేత్రాన్ని పరిమితము చేస్తుంది, కనుక జరగడానికి వీలున్న ఘటనలను కూర్చి నాటికను అల్లడమే కవికి మిగిలివుంటోంది, కనుక రంగనిర్దేశమూ

వర్ణనా కూడా రచయిత పనులే అయిపోతాయి. నాటికా రచయితలో నాటికా ప్రదర్శకుడు కూడా ఇమిడి వుంటాడు. ఈ నాటికలలోని రంగాలు ప్రదర్శనమును మనస్సులో పెట్టుకొని నిర్మించినట్టివే. ఊచలు లేని కిటికీ 'వాగ్దానము'లో చక్కని ఉపయోగము వచ్చింది.

నాటకములో గాని నాటికలో గాని పాత్రలు నిండు వ్యక్తులు కావాలి. కేవలము ఒక అవసరము మాత్రము తీర్చే కారుణ్యమూ, కారణము లేని కాపట్యమూ నాటకము కోసము అవతరించిన శాంతమూ వంటివి, సహజములు కావు. అలాటివి నాటకాల్లో ఉండరాదు. ఈ జాగ్రత్త పడాలంటే నాటకీయ వ్యక్తులు కొద్దిమందిన్నీ, వ్యక్తుల సంభాషణ సుదీర్ఘమున్నూ కావలసివస్తుంది. సంభాషణ దీర్ఘమైన కొద్దీ వ్యక్తులు స్ఫుటమౌతారు. కాని కథ పల్చబడుతుంది. కథను సాగగొట్టని దీర్ఘ సంభాషణలు, నడుమ నడుమ సాయపడే ఘటనలతో సాగిపోవాలి నాటికలు. ఈ నాటికలలో ఆ సుగుణం చక్కగా కనబడుతుంది.

నాటిక ప్రేక్షకుల ఉత్కంఠను పోషించాలంటే విచిత్ర సన్నివేశాల్ని సృష్టించాలి రచయిత. సన్నివేశము ప్రేక్షకులు గ్రహించగలిగేటంత సరళముగా వుండాలి, వారి అపేక్షని పోషించేటంత జోరుగా, సహజముగా నడవాలి. ఈ నాటికలలోని సన్నివేశాల విచిత్ర సంభవమూ వాటి పరిష్కారమూ చక్కని నేర్పుని సూచిస్తున్నాయి.

ఈ నాటికల నన్నిటినీ ప్రదర్శించడానికి వీలు ఉన్నది. 'అపశ్రుతి'లో ఒక్కచోటు—రాఘవరావు ఉపన్యాసించడము — లోకవృత్తానుకరణమే కాని నాట్యధర్మియగునా అని నా సందేహము. ఈ నాటికలు ప్రదర్శన ధర్మాన్ని అనుసరించి రచించినవి. అన్నీ ప్రదర్శించవచ్చును. ప్రదర్శనాలుకూడా బిగువుగా సాగుతవి. నాటకరంగం క్రమంగా అదృశ్యమౌతుందేమో అని కళాభిమానులు జడుస్తున్న ఈ కాలంలో ప్రదర్శనానుకూలములైన నాటికలు రావడం ముదావహము. కవిత్వంలో చేయితిరిగిన ప్రకాశరావుగారు నాటికలనుకూడా ఇంపుగా రచించడం సంతోషించదగినదీ, వారింకా చక్కని నాటికల్ని వ్రాయడము కోరదగినదీను.

నెల్లూరు — డాక్టరు శ్రీపాద గోపాల కృష్ణమూర్తి

6-8-60 — M. A. Ph. D.

# అంకితము



నటరాజ
కె. వేంకటేశ్వరరావు

హితుడు - సన్నిహితుడు
నటుడు - మహానటుడు
చిరంజీవి
కె. వేంకటేశ్వరరావు
అచిరకాలమ్ములో
ఆంధ్రరంగమ్మున
అమితానుభూతితో
అగ్రతాంబూలము
అందుకోవోయి !
అమరకీర్తుల
అలరుదండలు
అందుకోవోయి!
లలిత కళాంగనా
చలిత కరాంగులీ
లులితసుమాక్షతలు
అందుకోవోయి!
అని
ఆప్యాయంగా
ఆశీర్వదిస్తూ
ఈ
నాటికా సంపుటి
అంకితం

ప్రణేత



# ఆద్యంతాలు

రచన 10—6—55

పాత్ర సూచి :—

శాస్త్రి ...

శేషగిరి ... శాస్త్రి కొడుకు

సోమయాజులు ... శాస్త్రి బావమఱది

రామారావు ... సోమయాజులు కొడుకు

అవధాని ... శాస్త్రి కాపురమున్న ఇంటి యజమాని

రంగము :— చిన్న యింటివరండా. వరండాలోనికి సగము మూసిఉన్నాతలుపు కనిపిస్తుంది. ఆ వరండాకు రాక పోకలకు ఇంకొకతలుపుకూడాఉంది. అదే వారికి వీధిగుమ్మం. ప్రక్కవాటావారికి, వీరికి సంబంధం లేదు— కాని ఆ యింటిలో మాటలు వీరికి. వీరింటిలోమాటలు వారికి వినిపిస్తుంటవి. ఆ వరండాలో ఒక పొడుగుపాటిబల్ల, గోడవార ఒకస్టూలు, ఆ స్టూలుమీద మంచినీళ్ళచెంబు, గ్లాసు, గోడమూల రెండు కఱ్ఱలు, గుమ్మానికెదురుగా ఒక చాప, హరికెను లాంతరు వ్రేలాడదీసి ఉంటుంది. వెలిగించి తగ్గించిఉంటుంది. తెర లేచేటప్పటికి శాస్త్రి వరండాలో అటుఇటు పచారుచేస్తుం టాడు. లోపలనుంచి వస్తున్న మూలుగు ఎక్కువవుతున్న కొద్దీ ఆతడు తచ్చాడటం ఎక్కువవుతుంది.

సమయం :- అపుడే చీకటిపడింది.

శాస్త్రి :- (గుమ్మందగ్గిరాగి) ఎలాఉందమ్మా ?

(లోనుంచిబాధగా) మధ్యాహ్నంమల్లేనే-ఇంకాకొంచెం...

శాస్త్రి :- మంత్రసాన్ని రమ్మన్నాను- వస్తానంది-... దొడ్డి తలుపు తీసిఉందా ?

(లోనుంచి) తీసేఉంది—అన్నయ్యకు త్తరంవ్రాశావా?

శా :- ఠెలిగ్రామే ఇచ్చాను మధ్యాహ్నం. (గుమ్మానికి చేతులుపెట్టి నిలబడి) ఏం బాధగాఉందా ? మనఇల్లు ఆన వాలుకూడా చెప్పివచ్చాను. మంత్రసాని ఈపాటికి వస్తూ ఉంటుంది. (తలుపుచప్పుడు) అదిగో మంత్రసాని మాటల్లోనే (తలుపుదగ్గరకువెళ్లితీసి తెల్లబోయి) మీా రా! రండి.

అవధాని (ప్రవేశం) :- నమస్తే

(లోనుంచి) అబ్బా! వచ్చిందా సాన్ని!

శా :- లేదమ్మా- ఇంకోగడియలో వచ్చేస్తుంది.

(లోనుంచి బాధగా) ఎవరు మరివస్తా ?

శా :- ఇంటిఆయన (అవధానితో) కూర్చోండి. మరచిపోయా మీా పేరేమన్నారు - ఇలాకూర్చోండి (బల్లచూపిస్తాడు. అతనితో "ఎందుకువచ్చాడురా" అన్నట్లు సంభాషణ సాగి స్తాడు. వీరిసంభాషణ సాగుతుండగా లోనుండి మూల్గులు విని పిస్తావి. మధ్యమధ్య గుమ్మందగ్గరకు వెళ్ళి వస్తుంటాడు,)

అ :-పరవాలేదులెండి- నాకు మా తాతయ్య వేంకట శివ రామ శేషావధాని అని నామకరణం చేశాడు. మా అమ్మ

బ్రతికున్నపుడు వాళ్ళ నాన్నగారిపేరని "రామశేషు"అని పిలిచేది, మర్యాదగా. చూచారూ మా నాన్న "శేషావ ధానీ"అని పిలిచేవాడు. కాని మానాన్నకి కోపంవస్తే మాత్రం మనిషి కాడులెండి. అప్పుడు "ఏరా అవధానిగా" అని పిలిచేవాడు. చూచారూ, నేను పుట్టిన జన్మనక్షత్రంలోని అన్నిఅక్షరాలు వచ్చేటట్లుచూచి తూచి నాపేరు పెట్టడంటే నమ్మండి మా తాత–చూచారు మా తాత ఆంధ్ర దేశంలో పేరుమోసిన సిద్ధాంతిలెండి.

శా :– అలాగా!

అ :– శేషయ్యసిద్ధాంతిగారిని మీా రెరుగరూ?

శా :– విన్నట్టే జ్ఞాపకం.

అ :– విన్నట్టుజ్ఞాపకం! ఆయనపేరు దేశదేశాల దద్ద రిల్లి పోతేనూ. చూచారు– ఎర్రగా– పొడుగ్గా...

శా :– ఆఁ! ఆఁ! జ్ఞాపకంవచ్చింది. జాతకభాగంలో అంత వారు లేరనిప్రతీతి– అయితే వారిప్పుడెక్కడున్నట్టు?

అ :– (పైకిచూపిస్తూ) అక్కడ. చూచారు శ్రీనాధుడు చస్తూ చస్తూ ఓపద్యంవ్రాశాడు,

దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ
అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి

అల్లాగే, దివిజజ్యోతిష్కుగుండియల్ దిగ్గురనగ
అరిగినాడు మా తాతయ్య అమరపురికి.

శా :– సరి! మీాకు కవిత్వంకూడా వచ్చినట్లుందే–

అ :- "వచ్చినట్లుంచే" అంటారేమిటి- అసలుకవినేనేను- చూచారు- ఈ రోజుల్లో కవికావడానికి ఏముందండి-నాలుగు పాదాల గీతమో, అయిదుపాదాల అభ్యుదయగేయమో గిలికినవాడల్లా ఒక మహాకవి. పత్రిక చేబట్టి అర్థంలేని విమర్శనలు చేసేవాడల్లా ఒక మహాసంపాదకుడు- గాంధిటోపీ పెట్టినవాడల్లా ఒక కాంగ్రెసుభక్తుడిలా...

శా :- మీరేమయినా గ్రంథరచన—

అ :- సాగించానా ? అంటారా ? — ఆ — సాగించకుండా ఏంచెయ్యమంటారు చెప్పండి. చూచారూ- ఆశుకవిత్వం, భావకవిత్వం, ప్రజాకవిత్వం, ఇంకా అభ్యుదయ కవిత్వం చివరకు అతి వాస్తవ కవిత్వం కొద్దోగొప్పోవ్రాసి ఆంధ్ర దేశంలో అవధానివంటి ఆంధ్రకవి అరుదని అనిపించుకొన్నా.

శా :- ప్రస్తుతం...

అ :- ఏమివ్రాస్తున్నాననేనా మీఉద్దేశం, చూచారు "నాటకాంతం కవిత్వమ్" అన్నారుగదా- అందుకని నాటకరచనకు పూనుకొన్నా, పూనుకొని ఊరుకున్నాననుకున్నారా—

శా :- తెగవ్రాసి పారేశారన్నమాట—

అ :- అబ్బే, అదికాదండీ ! ఒక నాటక సమాజాన్ని లేవదీశాను— దానికి "రసికజనరంజని" అని నేనే నామకరణంచేసి పారేశాను-

శా :- మీ తాతగారు లేరుగామరి—

అ :- ఆ- ఆ- చూచారు- చూచారు-

శా :- చూచా- మంచిపనిచేశారు.

అ :- లేకపోతే మన నాటకాల్ని ఎవరు వేస్తారు చెప్పండి- చూచారు. ఆ సమాజానికి అధ్యక్షుణ్ణినేనే, కార్యదర్శిని కూడా నేనేనండోయి.

శా :- అయితే ఏగొప్పేంబాగావు.

అ :- అనుభవంగల మాట చెప్పారు- చూచారు- ఆ సమాజానికి నేను కవిని. సరేసరిగదా- దర్శకుణ్ణినేనే- ప్లోరస్సు వ్రాసిచ్చేవాడినినేనే. ప్రాంప్టింగు చేసేవాడినినేనే- చివరికి బంట్రోతునికూడా నేనే-

శా :- ఉద్దండుడిలాఉన్నారే- అయితే, నటకులుకూడా మీరేనా కొంపదీసి-

అ:- అదిమాత్రం కాదండోయి మీ ధర్మమాఅంటూ- చూచారు.

శా :- అవునులెండి ఏకాంకికనాటకాల్లా ఏకపాత్ర నాటకాలింకా రాలేదుగా అమల్లోకి.

అ :- మీకు కొంచెం సాహిత్యంలో పరిచయం ఉన్నట్లుందే.

శా :- ఆఁ- నాసంగతే చెప్పొచ్చారు.

అ :- ఆఁ- సంగతంటే జ్ఞాపకంవచ్చింది- ఇంతాచేసి చెప్పవచ్చిన సంగతే మరిచిపోయా- చూచారు-

శా :- ఆఁ, ఏసంగతి- ఏసంగతి- (ఆదుర్దాసూచిస్తాడు)

అ :- చూచారు- ఏమీలేదు- మా నాటక సమాజానికి కార్యాలయంఉండే మీకద్దెకీయగా మిగిలినగది (ప్రక్కగది

చూపి) అదే నా నివాసంకూడా. అందులోనే మా నాటకం రిహార్సల్సు చేస్తుంటాము (త్రిశూ)–

శా :– (నిట్టూర్చి) ఇన్ని అద్దెకి గోరకనిక్ జూగ్లో –మంచిపనే–

అ :– ఈమధ్య ఓనాటక సమాజం నుంచెండి– చూచారు– దానికి రిహార్సల్సు ఈవేళ రాత్రి ఎనిమిదిగంటలకు ప్రారంభం.

శా :– నన్ను కూడా అక్కడకి–...

అ :– అబ్బే! రానక్కర లేదు లెండి– చూచారు– మా రిహార్సల్సు వల్ల మీకిబ్బందికల్గినా– క్షమించమని చూచారు.

శా :– దాని కేముందండి– ఎవరిబ్రతుకు వారుచూచుకోవద్దూ.

అ :– మహ బాగాచెప్పారు చూచారు– ఇదంతా, నాటక కళోద్ధరణకు కంకణం కట్టుకోనకపోతే– నాకెందుకుచెప్పండి మహారాజులు, మహాజమీందారులు, మహాధనవంతులు, పూనుకోవలసింది కాని మనలాంటి మహాజనులుపూనుకొంటే ఏమయినట్టు– మీ రేచెప్పండి.

శా :– ఉడతాభక్తి–

అ :– అలాఅనుకొనే ఈభారం– చూచారు

(లోనుంచి) అబ్బా! అమ్మా!

శా :– అమ్మా! (గదిగుమ్మందగ్గరకు వెళ్ళబోతాడు)

అ :– అమ్మాయిఒంట్లో

శా :– కొంచెం నలతగాఉంది

అ :– అందుక నేనా– మంత్రసానిఅని అంటున్నారు నే వచ్చే ముందు– చూచారు మంచిసమయంలోనే వచ్చాను– సరి–

మెంబర్లు వచ్చేవేళ అయింది - వచ్చేఉన్నారేమో కూడా వెళ్ళి వస్తానండి శాస్త్రిగారు-

శా :- ఆఁ-...

అ :- (గుమ్మందగ్గరకు వెళ్ళి నిష్క్రమించబోతూ) ఆచారు- మా తాతయ్యఉంటే మీ మనుమడికి మంచిజాతకం వ్రాసే వాడు. వస్తానండి నమస్తే-...(నిష్క్రమణ)

(లోనుంచి) అబ్బా! అమ్మా!- ఆఁ-

శా :- మరత్రసాని లేదా అమ్మా!

(లోనుంచి) వస్తానండి అయ్యగారు.

శా :- సరే, సరే. జాగ్రత్తగా - నేనిక్కడేఉంటా- వేడినీళ్ళు అవి. అన్నీ పెట్టేఉన్నాయి. ఏది కావలసినా నన్ను పిలు. (పీతలుపు వేసివచ్చి దీపం హెచ్చించి అటుఇటుపచారు చేస్తుంటాడు. లోపల మూలుగు ఎక్కువవుతున్న కొద్దీ శాస్త్రి పచార్లలో వడి ఎక్కువవుతుంది. ఇంతలో ప్రక్కగదిలోనుండి మాటలు మనుష్యులసడి విన్పిస్తుంది)

శా :- (గోడకు చెవినానించి) మెంబర్లు వచ్చారు కాబోలు! (ప్రిక్కగదిలోంచి రిహార్సలున్న వినిపిస్తవి. ఆ సంభాషణలోని భావాలననుసరించి శాస్త్రి కూర్చోవడం, లేవడం, తచ్చాడడం, కన్నులు పెద్దవిచేయడం, ముఖముద్రికలుమార్చడం, భంగిమలు పెట్టడం ఇత్యాదిపనులు చేస్తుంటాడు. మగకంఠం శాస్త్రి కంఠంలా స్త్రీ కంఠం శాస్త్రి కూతురుకంఠంలా ఉంటాయి.)

మా॥కం :- ఏంపనిచేశావే పాడుపని- అయ్యో- నా కొంప తీశావు. నన్ను నట్టేటిలో ముంచావు. మణపూసలాంటి వంశానికి మసిపూశావు. రేపు ఎలావీధిలో తలెత్తుకుతిరగడం- ఇంక ఉద్యోగం ఎలాచెయ్యడం.

(నిశ్శబ్దం)

మా॥కం :- నంగనాచిలాఉండి నాకొంపతీశావే- ఆగది ... యకు వెళ్ళవద్దే, అంటేవిన్నావా!- ఎందుకువింటావు నామాట. వాడినిచూచి నీవునవ్వుతున్నప్పుడే అనుమానించాను కాని- కాని- ఏమో అనుకున్నా-ఇలాచేస్తావనుకున్నానా. (సన్నగా ఏడుపు వినిపిస్తుంది!)

మా॥కం - పైగాఏడవడం- ఎందుకువచ్చిన ఏడవడం- నా బ్రతుకు బగ్గంపాడుచేసి- నా జీవితంలో చిచ్చుపెట్టి- ఇంకాఏడుస్తావు. ఇలా తలెత్తుకుని తిరగనీయకుండా ఏడ్పిస్తున్నదికాకుండా- నీవేడుస్తావుటేపైగా- ఏడిస్తేపోతుందటే.

స్త్రీ॥కం :- నాకర్మ

మా॥కం :- నాకర్మ- నీకర్మ నాకర్మకలసి ఏకమై నా నెత్తినెక్కి- తాండవిస్తున్నది. అవును. అవును కర్మేనురి-కర్మకాక- నిక్షేపంలాంటివాడు- ముక్కా, ముసలా, ఈడు జోడుచూచి- కట్నం మన తాహత్తుకుమించినా లెక్క-సేయక చేశాపెళ్ళి. "తాలూకాగుమస్తాఏమిటి ఇంతదర్జాగా కూతురి పెళ్లిచేయడమేమిటి" అని చూడవచ్చిన వారంతా విస్తుపోయారు. నీవు పెద్దమనిషివికాకుండానే ఆ అబ్బాయి...ఏం

చేయగలం. విధివ్రాత. (నిట్టూర్పు)

పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టుగా ఉంది. అలా చదువుకొంటున్న దానవు చదువుకోక - ఇదేమిటే, నానెత్తికి తెచ్చావు. వాడేడే - ఆ గదికి తాళంవేసి ఎక్కడికి చక్కాపోయాడే - చెప్పవే - చెప్పకపోతే ఎలా...

స్త్రీ॥కం :- ఉద్యోగంకోసం.

మ॥కం :- ఉద్యోగం! ఎవడిస్తాడే ఈరోజుల్లో - స్కూల్ ఫైనలు ప్యాసవ్వనిశుంఠకి- అచ్చికబుచ్చికలాడి ఏదో నమ్మించి నిన్ను వల్లోవేసికొని మోసగించి నీదారిని నీవు చూచుకోవేఅని వాడిదారంట వాడు చక్కాపోయాడు- ఉద్యోగం అయ్యాక పెళ్ళాడి నిన్నూ ఏలేగిస్తానన్నాడా- ఏం- ముంచుకువచ్చేసిందే- మరిప్పుడో -

(నిశ్శబ్దం)

మ॥కం :- ఎందుకుమాటాడుతావు? మాటాడవు, ఇదంతా నానెత్తికివచ్చింది. ఈ సంగతి విన్నదగ్గరినుంచి ఆఫీసుకు వెళ్ళడానికి నాకు కాళ్లురావడంలేదు- బయటికి కదలడానికి మనసురావడంలేదు- అప్పుడే ఆరోనెల- మొన్న దాసీది నిన్ను పరకాయించిచూస్తూ లోలోన ముసిముసినవ్వులు - పాల గొల్లదీ అంతే- పాలుపోస్తూనేఉంది, ఓరకంటితో నీకేసి, చూస్తూనేఉంది- ఈసంగతి ఇక్కడితో ఊరుకుంటుందా! ఆ నోటా, ఆనోటా కార్చిచ్చులా ఊరిలో ఒక్కసారి భగ్గు మంటుంది- ఎలా- ఎలా!...

స్త్రీ॥కం:- ఏమయ్యో, గొయ్యో!...

మ॥కం :- ఏమయ్యో, గొయ్యో- అవునుమరి ఇంతపనిజరిగాక ఏమయ్యో గొయ్యోగాక- నీవోనుయ్యి, నేనోనుయ్యి, మీ అన్నయ్యోనుయ్యి- బాగు- బాగు.

స్త్రీ॥కం :- మీ కెందుకుమధ్య.

మ॥కం :- మీ కెందుకూ ?- నిన్ను కన్నందుకు- నిన్ను పెంచి పెద్దదాన్ని చేసినందుకు- మంచిదానివని నిన్ను నమ్మినందుకు- సరే వాడెప్పుడు వస్తానన్నాడే- అదయినా చెప్పు.

స్త్రీ॥కం :- ఉద్యోగం దొరికాక.

మ॥కం :- ఉద్యోగం దొరికాక పూలపల్లకీ ఎక్కించి నిన్ను తీసుకువెళ్తానన్నాడా- ఏడ్చినట్లేఉంది. పెళ్లాడే ఉద్యోగప్రయత్నం చేయలేకపోయాడా అంతనిజాయితీవాడైతే.

(నిశ్శబ్దం)

మ॥కం :- రాడు- రాడు. ఎందుకువస్తాడు. వాడికింకేనువసరమని వస్తాడే నీవిచ్చిగాని- నిన్ను మసిపూసి మారేడుకాయ చేశాడు. అదీకాక- వాడికిదివరకే పెళ్లీపెడాకులు జరిగాయేమో- అయింది. నీపని అయింది- నాపని అయింది- కాని- కాని- నాపనే.

స్త్రీ॥కం :- మీ కేంనాన్నా- నేనే సతమతమవుతున్నా.

మ॥కం :- అవుతావే అమ్మాయి- బుద్దిగడ్డితిని చేసినపనికి అవక- రెండు మూడు నెలలకుముందే చెప్పలేకపోయావా- పోనీవాడుండగానే చెప్పలేకపోయావా- ఏమిదారి. అబ్బాయికి

టెలిగ్రాం ఇచ్చాను. వాడింకా ఏబండికి-...

అవధానిగొంతు :- Cut- ఆరిస్టు- ఇలారండి- ఒక్కమాట-

శాస్త్రి :- (తచ్చాడుతూ ఆగి నిట్టూర్చి) ఇది- ఇదినాటకమా? నాజీవిత ప్రతిబింబమా?

(లోనుండి) అమ్మా? అబ్బా! ఆఁ- ఆఁ-...

శా : ఏం- ఏం-...

(లోనుండి) ఏమీలేదండి. కష్టకడుతుంది. అమ్మాయి. నొప్పులు ప్రారంభమయ్యాయి- ఇంకో గడియకు-...

శా :- (పచారుచేస్తూ ప్రక్కవాటాకేసి చెవిఒగ్గుతాడు. ఏ సంభాషణ వినిపించదు.) అబ్బాయికి టెలిగ్రాం ఇచ్చాను. వాడింకా ఏబండికివస్తాడో (ఆత్రంగా ప్రక్కయింటి గోడకు చెవి ఆనిస్తాడు. తలుపు చప్పుడు.)

శా :- అబ్బాయి వస్తున్నాడుకాబోలు. అమ్మా అన్నయ్య వచ్చినట్లున్నాడే (తలుపు దగ్గరకివెళ్లి తీస్తాడు. అబ్బాయికి బదులు శాస్త్రిబావ సోమయాజులు ప్రవేశం. శాస్త్రికన్నా రెండుమూడేళ్లుచిన్న. గెడసబారి వుంటాడు.)

శా :- (దిగాలుగాచూస్తూ వెనక్కితగ్గి) నీవా?

సో :- ఆ, నేనే- ఆలాదిగాలు పడుతున్నావే-

శా :- ఆ, ఆ, తలవనితలంపుగా-

సో :- వచ్చాననా- శుభరేఖ అందలే.

శా :- అందకేం-

సో :- మరి- ఉత్తశుభశేఖలుపంపి ఊరుకొంటే- "అయిన

వాళ్ళని స్వయంగావచ్చి పిలువవద్దా '' అని మీారే అంటారు- అందుచేత బంధుకోటిని స్వయంగా పిలిచివద్దామని బయలు దేరాను. ఇల్లువిడిచిపెట్టి అప్పుడే నాలుగయిదురోజులు కావచ్చింది. అన్నీఅయినట్టే- మీాయిల్లేఆఖరు-

శా :- అలాగా.

సో :- అన్నట్టు మరచా- నాకేమయినా ఉత్తరాలువచ్చాయా

శా :- లేదే-

సో:- '' బంధుజనాన్ని అందర్నీ పిలిచి ఇక్కడకు చేరుకుంటాను ఏమైనా అత్యవసరకార్యముంటే మామయ్యపేర ఉత్తరం వ్రాయరా అబ్బాయి అని చెప్పివచ్చాలే- సరే, మీారెప్పుడు బయలు దేరడం.

శా :- మేమా-

సో :- అలా చూచేస్తున్నావే- ఇది ఎవరింటిలో పెళ్లిఅనుకున్నావు. పెళ్లిచూడొస్తే సరిగ్గా పదిరోజులు లేదాయె-

శా :- పదిరోజులుందిగా-

సో :- పదిరోజులెంతోయి పదినిమిషాలు- పరాయివాడిలా మాట్లాడుతున్నావు- మాచెల్లి పోయినంతమాత్రాన నీవు మాకు దూరమవుతావాబావా- బాగు. బాగు. పెళ్లింటిలో నిలబడి అన్నీనీవే చూచుకోవాలి- ఎన్నింటికని చచ్చేది, నేను- చూడు మావియ్యాలవారున్నారే బావా! చాలా ఘనాపాటి వారు- ఆస్తి కాస్తి వుందాకివుందా- మనకి రావలసిన సంబంధంకాదు. బావా మావాడి జాతకఫలం- సుందరయ్యగాడు

లేదూ-

శా :- మా అమ్మాయికి సంబంధం తెచ్చినవాడేనా-

సో - వాడే, వాడే- ఎంతమాటకారి అనుకున్నావు- అమ్మాయియేదీ ?

శా :- (మాటతప్పించి) కట్నమెంత ?

సో : కట్నానికేమిలే- అయిదువేలు- లాంఛనాలనీ, ఆడబిడ్డకట్నాలనీ- కానుకలనీ- దానాదీనా మనకు పదివేలుముట్టుతాయిబావా.

శా :- మంచిదే-

సో :- అది వాళ్ళకోలెక్కా- జమా- పెళ్లి అయిదురోజులు.

(లోనుండి) అబ్బా! అమ్మా!

సో :- ఎవరు ?

శా :- అమ్మాయిఒంట్లో నలతగాఉందిలే-

సో :- అలాగా! చెప్పావుకావు. చూచివస్తా (వెళ్లపోతాడు)

శా :- (అడ్డి). వెళ్లుదువుగానిలే- ఇలాకూర్చో- ఇంకా పెళ్లి ఏర్పాట్లు-

సో :- మనదేముంది. చూడుబావా- అంతావారిదే- మనం బాక్కులీసుగా వెళ్ళడం-పుస్తి ముడివేయటం.

శా :- కట్నంతో కన్యను తెచ్చుకోవడము-

సో :- అంతే- అంతే- సంగీతవిద్వాన్ సోమశంకరంపిళ్లే నాగస్వరంలో మంచి ఘటికుడులే- అతగాడి నాగస్వరం మొదట

రోజు- బాగానేఉందని ఒప్పుకున్నా- రెండోరోజు Travancore Sisters లలితాపద్మినులు లేరూ- వాళ్ల నాట్యం పెట్టిస్తా నన్నాడు- మలయాళపువాళ్లు. అరవవాళ్లేనా మనకుగతి. ఆంధ్రులడబ్బంతా ఏసుబ్బలక్ష్మికో- ఏతిరువెంగడంమునినాథ పిళ్లెకోపోసి ఆకళాకారుల్ని పెంచడందేనికి- నిక్షేపంలా మన ఆంధ్రులుంటేను- ఆంధ్రదేశం అమరసంగీతానికి ఏమయినా గొడ్డుపోయిందా-

శా :- ఆంధ్రాభిమానం జాస్తిలే నీకు-

సో :- కాక- అప్పుడేమన్నాడనుకున్నావు మావియ్యంకుడు "అయితే ఏమంటారు?" అన్నాడు. నేనన్నానుగదా, Travancore Sisters మనకెందుకు- మన Andhra Sisters ని పెట్టించండి అని.

శా :- వారెవరోయి- కొత్తపేరు.

సో :- ఎరుగవోయి- బావా- Andhra Sisters అంటే గీతా, సీతాకుమార్లు లేరూ?

శా :- ఎక్కడో పేరువిన్నట్టే-

సో :- వారు పదహారణాల ఆంధ్రులు- మన ఊరేకూడా- "షావుకారు" లోనూ- ఇంకా- ఇంకా ఏవోసినిమాల్లో కూడా వేశారులే-

శా :- ఆడతారా? పాడతారా?

సో :- అన్నీ చేస్తారు- ఆలాంటివాళ్లని పిలిపిస్తే ఆంధ్రుల్ని పోషించినట్లుంటుంది- కళకుకళ అభివృద్ధిపొందుతుంది,

శా :- ఒప్పుకున్నాడా మీావియ్యంకుడు.

సో :- ఒప్పుకోక- మనమాటకు తిరుగుందీ- "సరే ఆలాగే నండీ వాళ్ళనే రప్పిద్దాము అన్నాడు- చూడు బావా- పందిరి అలంకరించడానికి పదిమంది పనివాళ్లను పట్నాన్నించి తెప్పించాడట- ఒక్కగాని ఒక్కకూతురుకదూ-

శా :- ఆఁ- ఒక్కగాని ఒక్కకూతురు (నిట్టూరుస్తాడు)

సో :- (ఏదోఅనబోయి శాస్త్రి కేసి అలాచూస్తుంటాడు,)

(లోపుండి) "అబ్బా! అమ్మా!" అని వేదనధ్వని తరువాత పసిపిల్ల క్యారుక్యారుమని ఏడ్పు వినిపిస్తుంది.

మంత్రసాని (లోనుంచి) Time సరిగాచూడండి.

శా :-(సోమయాజులు కేసిచూస్తూ Time చూస్తాడు) 8-14 ని.

మంత్రసాని (లోనుంచి) మగపిల్లవాడండి బాబూ!

సో :- (విస్తుపోతూ) మగపిల్లవాడు- ఎవరికి

శా :- (గంభీరంగా)ఎవరికి- ఎవరున్నారింట్లో.

సో :- అమ్మాయి

శా :- ఆఁ-

సో :- ఏమిటీ- మనఅమ్మాయి సరోజ

శా:- (గంభీరంగా) మాఅమ్మాయి సరోజ.

సో :- సరోజ- ఏమన్నావు- మగపిల్లవాడు- సరోజ-

శా :- ఆ- నాపుత్రికారత్నం సరోజ- నీస్వయాన చెల్లెలిగారి కూతురు సరోజ- పెళ్లయిన మూన్నాళ్లకే ముండమోపై కూర్చున్నదే- ఆసరోజ-

సో :– ఆఁ– ఆఁ– (దిగాలుపడుతాడు)

శా :– ఎందుకలా దిగాలుపడుతున్నావు?

సో :– దిగాలుగాక

శా :– ఆలాకూర్చో– (అని బల్లమీద కూర్చోబెడుతాడు)

సో :– ఎంతపని– ఎంతపని– ఆమధ్యమీరా ఊరిలో ఉన్నప్పుడు వచ్చిచూచాను– ఏపుగా పెరిగింది– కాని చక్కగా చదువుకొంటున్నదని సంతోషించాను–

శా :– చదువుకీ దీనికీ సంబంధమేమిటోయి.

సో :– ఎంతపనిజరిగింది– ఇంతపని జగుతుంటేచూస్తూ

శా :– కూర్చున్నా–

సో :– ఆలామాటాడుతావేం ?

శా :– ఏలామాటాడను నాతలకాయ.

సో :– (లేస్తూ) ఇందుకనా– తెలిసింది– తెలిసింది– ఆఊరిలో ఉద్యోగానికి సెలవుపెట్టి ఈక్రొత్తూరులో ఆరోగ్యానికని–

శా :– మకాంపెట్టాం– తెలిసిందా–

సో :– తెలియకేం– మంచిఎత్తే

శా :– కాదూమరి

సో :– అబ్బాయికి ?

శా :– తెలుసు

సో :– అందరికుమ్మక్కున్నమాట

శా :– ఆ——

సో :– ఆ—— అంటావేమిటి

శా :– ఏమిచేయనుంటావు

సో :– ఏమిచేయమంటావు– అదేమిప్రశ్నోయి బావా పరువైన వంశంలో పుట్టావు, నలుగురిలో నిష్ఠపరుడవనిపించుకొన్నావు. మనవంశానికి మచ్చతెచ్చినదాన్ని కసాయికత్తితో కరకర్కమని తెగనరకక, ఈపాడుపనికి—

శా :– ఎలాఊరుకున్నానంటావా– నీకుచెపితే అర్థంకాదోయి

సో :– అర్థంకాకేం– చెప్పు.

శా :– ఏమనిచెప్పను. మీచెల్లిపోయినదగ్గరనుంచి ఎవరిని చూచుకొని బ్రతుకుతున్నాను. ఎవరిని చూచుకొని ఈఉద్యోగం సద్యోగం చేస్తున్నాను. ఈఎడారి జీవితంలో ఈచల్లని వానచినుకుల్ని ఎవరుచిలికించారు– నీకుతెలియదు– (చదికిలబడి బల్లమీద, తలపట్టుకొని) ఏమిచెయ్యమంటావోయి. కడుపు చించుకొంటే కాళ్ళమీద పడుతుంది. ఒక్కగాని ఒక్కకూతురు– (నిట్టూరుస్తాడు)

సో :– బాగు– బాగు– ఒక్కకూతురైతే, కుండపెంకులైతే– ఒక్కమాటా చూచినతరువాత– మంచీమర్యాద పంచబంగాళమయ్యాక– ఆజన్మాంతం కళంకం అనుభవిస్తావా– ఎటువంటి వంశం– ఎటువంటివంశం– అయిదుసోలలవారంటే ఎలాపేరుమోసింది– ఇటు ఏడుతరాలు– అటు ఏడుతరాలు ఎలా గాలించి చూచినా మచ్చఅన్నది లేదుగదా! అంతా పండితులు, శిష్టులు, నిష్ఠులు– అందుకనే మన వంశగౌరవాన్నిచూచి మాకేమీ లేకపోయినా అబ్బాయికి పిల్లనిస్తామన్నారు.

శా :– (కళ్ళుతుడుచుకుంటూ లేచి) ఇస్తే చేసుకోండి–

సో :– చేసికోనా– ఎలాఇస్తారింక– తెల్లారితే కొంప్చచ్చేలా ఊరంతా పాకిపోతుందే ఈవార్త– పత్రికల్లో పెద్దపెద్ద అక్షరాలతో పడిపోతుందే- గోడలమీద కెక్కిపోతుందే– మా వియ్యంకుని చెవినిపడుతుందే– నాకొడుకుపెళ్ళి...

శా :– పెళ్ళి– పెళ్ళిచేసుకో– మేము [illegible]ముగా—

సో :– మేము రామంటేసరా– దానితోపోతుందా– మా వియ్యంకుడికి తెలిస్తే అసలు పిల్లనెలాగిస్తావోయి బావా– (తచ్చాడి) పెళ్ళి ఆగిపోయినట్లే– ఇంకమావాడికి జన్మలో పెళ్ళి కానేకాదు– వాడిజాతకఫలం–

శా :– ఎందుకుకాదోయి– మగాడు.

సో :– మగాడు– అయితే– బాగాచెప్తున్నావులే మాటలు– నీకేం నీకొడుక్కి పెళ్లయింది– ఇంక కార్యాలు చేసేవారు అటూఇటూ ఎవరూలేరు– నీకేం చిలకపలుకులు పలుకుతావు

(శాస్త్రి మాటాడక ఒకమూలకు వెళ్లుతాడు)

సో :– (వెళ్లుతున్నవాణ్ణి ఆపుతూ) మాటాడక అలాపోతావేం– నాకేదో దారిచూపించు, ఇటుచూడు - మంచీమర్యాద ఎరిగినవాడవు ఇలాంటి పనికి ఎలాఅంగీకరించావు– తెలియగానే దాన్ని ఏపాషాణమోవేసి–...

శా :– చంపెయ్యమంటావా– ఛీ నీవు ఏమన్నా—

సో :– మనిషినా పశువునా అంటావు. గౌరవంబగ్గంపాడు అయ్యాక పశువునైనాపరవాలేదు– అప్పుడు మంచి, మర్యాద

వంశగౌరవం, సంఘం, ధర్మం, ఏమీఉండవు- తులసివనంలో గంజాయిమొక్క-లా-

శా :- చాల్లే!- ఊరుకో.

సో :- ఊరుకుందామనుకుంటే మాఅబ్బాయిపెళ్ళి-

శా :- చేసుకో- సోమశంకరపిళ్లై నాగస్వరంతో- సీతా Sisters గానకచేరీతో- చేసుకో

సో :- అలాగే చేసుకొందును- మధ్యని ఈ అపస్వరంవచ్చి పడిందిగదా!

శా :- మాకూమీకూ-...

సో :- సంబంధం లేదవనా- ఎలా- స్వయానా చెల్లెలికూతురు

శా :- మేంచచ్చామనుకో

సో :- అనుకోడమెలా?- ప్రత్యక్షంగా కనుపిస్తుంటే- ఈ మాటలకేమిగాని- అసలుసంగతికిరా- తెల్లవారితే ఈసంగతి పాము బుసకొట్టినట్లు కొడుతుంది-

శా :- (విసుగ్గా) అయితే చంపక- ఇప్పుడేమిచెయ్యమంటావు.

సో :- నేనాచెప్పేది- నాకుమతిలేక నేనుకొట్టుకుంటుంటే చూడుబావా, ఇంతవరకువచ్చిన మాఅబ్బాయిపెళ్లి ఆగిపో తుంది. అది తథ్యం- ఇంకెప్పుడూ మరెప్పుడూ మావాడికి పెళ్లిజరగదు- అది తథ్యం-

శా :- (విసుగ్గా) ఏది తథ్యంకాదో చెప్పుదూ చంపక-

సో :- ఒకవేళ అథవా సంబాధం వచ్చినా ఇంతడబ్బుగల సంబంధంరాదు అదీతథ్యమే- ఎలా- దొరక్క-దొరక్క- దొరి

కింది సంబంధం. పదిరోజులలో పెళ్లి-అమాంతంగా ఈపిడుగు పాటు(రెండడుగులు ఆలోచిస్తూముందుకువేసి) చూడు బావా-

(శాస్త్రి తలెత్తిచూస్తాడు)

సో :- చూడు- ఆపుట్టినపిల్లాణ్ణి ఏంచేస్తావు.

శా :-ఏమో

సో :- ముద్దులమనుమణ్ణి పెంచుకుందామనిఉందా-

శా :- ఏమో-

సో :- ఏమో- ఏమో- ఈఏమోలతో నాకుపిచ్చెత్తిపోతు న్నది- ఇలా సందిగ్ధంగా కూర్చుంటే వ్యవహారం బెడిసికొట్టు తుంది- మాఅబ్బాయిపెళ్లి అమాంతంగా ఆగిపోతుంది. అంత మంది బంధుకోటిలో అవమానం- ఘోరావమానం_

శా :- ఇన్నాళ్లు అవమానాన్ని గరళకంఠుడిలా భరించుకొని వస్తున్నా- అంతకంటేనా-

సో :- అందుకనే నేను చెప్పినట్లు చేస్తావా-

శా :- చేయక చేసేదేముంది ?

సో :- చూడు (అటుఇటుచూచి) ఈపసిగుడ్డుని- మంత్రసాని చేతికిచ్చి- ఈరాత్రికిరాత్రి-...

శా :- ఛీ- పాషండుడా- అది హృదయమా, పాషాణమా- బిడ్డలేరా-

సో :- ఉన్నారుకనుకనే- ఆ ఉన్నబిడ్డలకోసమే ఇలాచేయ మంటున్నా- తెలిసిందా- తెల్లారితే అపవాదు- రేపు మా అబ్బాయిపెళ్లి- చెప్పవేం-

శా :- నేనేమిచెప్పేది.

సో :- నీకు చెప్పడానికేమీ లేదు- ఉన్నా- ఏమీ చెప్పవు. నాకు తెలుసు. నీకేం అన్నీ తీరి కూర్చున్నావు- నా ఒక్కగా నొక్క కొడుకు పెళ్లి ఇప్పుడు జరగకపోతే ఎప్పుడూ జరగదు. --జరగదు- నీకు చేతకాకపోతే నేనన్నా చేస్తానాపని. ఈ కుళ్లు ఇంటిలో ఉంచుకొని జీవితాంతం మ్రగ్గవలసిందేనా- ఈ కళంకం నీకొడుక్కే-కాక నాకొడుక్కు- నీకొడుకు కొడుకు లకు వాలుచుక్కయి కూర్చోదా? ఆలోచించు.

శా :- ఏముంది ఆలోచించడానికి.

సో :- అవును- నిజంచెప్పావు- ఉన్నఊరుని, ఉద్యోగాన్ని, సంఘాన్ని- గౌరవాన్ని వదలివేసినవాడికి ఏముంటుంది, ఆలో చించడానికీ- కాని- కాని. నాకొడుక్కి పెళ్ళిఆగిపోతుంది కాని, నీకొడుక్కి కాదుకదా- నలుగురిలో తలవంపులు నాకు గాని, నీకుగాదుగదా- అదిగాక సంఘంలో వెలి- వెలి- ఏ మొగంపెట్టుకొని చుట్టాలను చూస్తావు- ఏ మొగంపెట్టుకొని సంఘంలో తలెత్తుకొని తిరుగుతావు- మర్యాద, గౌరవం, వం శం, ప్రాణం- అన్నీ నాశనం- సర్వనాశనం- నేనుభరించలేను- సహించలేను- ఈ మచ్చను పిండెలోనే- ఇప్పుడేమాపేస్తా- (అని చరచరా లోపలికి వెళ్లుతుండగా శాస్త్రి అడ్డువచ్చి ఆపుతుంటాడు- ఈసమయంలో శాస్త్రికొడుకు శేషగిరి ప్రవే సిస్తాడు- సోమయాజులు శాస్త్రిని తప్పించుకొని లోపలికి ఒక అడుగు లోపలికి పెట్టేలోపున)

శే :- ఆగు-

శా :- శేషగిరీ..

శే :- ఆగ వేం- ఒక్క అడుగు ముందుకు వేశావంటే జాగ్రత్త-

సో :- మా అబ్బాయి పెళ్ళి-

శే :- పెళ్లీ లేదు. గిల్లీ లేదు వెనక్కి తిరిగి రా- ఇదిగో చూచావా (పక్కనున్న కఱ్ఱ తీస్తాడు)

సో :- (చట్టున వెనక్కి తిరిగి) ఈ పౌరుషం మీ ఊళ్లో- మీ యింటిలో అద్దెకున్న కుఱ్ఱాడి మీద చూపలేకపోయావేమిరా- తండ్రి దద్దమ్మ అనుకున్నా-

శే :- అంతకన్నా నేను-

సో :- కాక- ఇంతకుళ్లు ఇంటిలో పెట్టుకుని-

శే :- అది మా యిష్టం.

సో :- మీ ఇష్టంతో సాగదురా- సంఘం

శే :- వెధవ సంఘం ఎవడికి కావాలి-

శా :- మనల్ని వెలివేస్తుందట-

శే :- మనమే సంఘాన్ని వెలివేద్దామనాన్నా-

సో :- వెలివేయడంతో ఆగదురా-

శే :- ఏమి చేస్తుందేం! కౌగలించుకొంటే కత్తితో పొడుస్తుంది వాళ్ళ మీద పడితే కాలెత్తి తన్నుతుంది- అంతేగా-

సో :- అంతే కాదురా అబ్బాయి- సంఘానికి ఎదురీది-

శే :- బ్రతికే వాళ్లు లేరంటావు.

శా :- ఊరుకోరా అబ్బాయి-

సో :- పాలుపోంగు- ఇంత అమానుషకృత్యం జరిగించేటని విచారించక- ఈకుళ్లులోంచి తప్పించుకొనే తరణోపాయం కోసం అంగలార్చక-

శే :- ఇది అమానుషకృత్యమా?

సో :- వేరే చెప్పాలా-

శే :- దీనికి బాధ్యులు-

సో :- అడుగోమీనాన్న, కాలువయస్సులో కన్నామిస్నా కాకుండా ఉన్న నీవు-

శే :- కాదు- మానాన్నా కాదు- నేనూ కాదు-

సో :- మరి

శే :- నీవు.

సో :- నేనా- నేనా-

శే :- ఆ ముమ్మాటికినీవే, చెల్లాయి పెద్దమనిషి కాకుండా బావచనిపోతే కాళ్లాగళ్లా బతిమలాడాను మళ్లీ పెళ్లిచేయమని- నామాటలువిన్నావా-

సో :- నేనెవరినిరా- మీనాన్న-

శే :- మానాన్న- నీనోరెలావచ్చింది అలాఅనడానికి- అంత పెద్దవాడైన అర్థంచేసుకొనిపాతపద్ధతుల్ని త్రోసి రాజని సంఘాన్నెదిరించడానికి సిద్ధపడ్డాడు- నీవు- నీవేమీ సంఘాన్ని అండగా పెట్టుకొని అడ్డంనిలిచావు. ఎంత బ్రతిమలాడినా ఆ సంఘం తన ఇనుపపాదాన్ని కొంచెమైనా సడలించందే - అప్పుడే మళ్ళీపెళ్ళి చేసివేసిఉంటే ఈఅనర్థం ఎలావచ్చిపడుతుందా-

నీవనుకున్నా – అమానుషకృత్యం ఎలాజరుగుతుంది- చెప్పవేం- మాటాడవేం- అప్పుడు సంఘం ఇనుపగజ్జలు ఘల్లుఘల్లుమం టూండగా భయంకరాకారంతో భీకరాట్టహాసంచేస్తూ ఎదుర నిలిచింది. ఆభీషణావతారానికి గజగజలాడిపోయాడు తెలి సిందా- చిన్నది- అన్నెము పున్నెము ఎరుగనిది- వయస్సు వచ్చింది- సంఘములో మెలుగుతూంది. సాత్వికాహారమేమీ తినడంలేదు- దానికి పెళ్ళి అక్కర్లేదూ. ఆనందం అక్కర్లేదూ. యావజ్జీవం బ్రహ్మచర్యం సాగించాలీ- నీవు- నీవూ ఆసంఘం లోనివాడవే- ఆసంఘంలోని వారెంతమందివద్దన్నా విన్నావా- ఒకపెళ్లాన్ని రెండోపెళ్లాన్ని- ఈవయస్సులో మూడోపెళ్లాన్ని కూడాకట్టుకున్నావే- ఏళ్లుమీరాయని ఏమయినా ఆలోచిం చావా? నీకు పెళ్లిమీదపెళ్లి కావలసివచ్చిందా- కాని ఆ పడుచుపిల్లకు-

సో :- ఆడదిరా-

శే :- అయితే.

సో :- దానికీమనకు సాపత్యమా

శే :- అదా- స్త్రీకి పురుషుడికి విబేధం కల్పిస్తున్నావా- దేవుడి దృష్టిలో అందరూ ఒక్కటే- దేవుడు మన్నీ, వారినీ కించిదంగ విభేదంతో ఒక్కలాగే సృష్టించాడు. వారికీ ఆకలి వేస్తుంది- మనకీ ఆకలివేస్తుంది- వాళ్లు గాలిపీలుస్తారు- మనమూ గాలిపీలుస్తాము- మనల్నికోస్తే రక్తం- వాళ్లని కోస్తే నీరూరాదుకదా! పైగా మనకెలాంటిమేధస్సు ఇచ్చాడో

వారికలాంటిమేధస్సు ఇచ్చాడు- నీవాలోచించినట్లే వారు ఆలోచిస్తారు- వారికీ కాంక్షలుఉంటాయి- వారికీ సుఖాలు కావాలి, నీలా- అయితే ఎందులోభేధం- ఎందుకీవిభేదం.

సో :- అయితే అప్పుడే పెళ్ళిచేసి వారేయలేకపోయావోయి-

శా :- అలాగేచేసిఉందును. ఇప్పుడున్న ఇంగితజ్ఞానం అప్పుడుంటే- నీతో ఇలా ఎందుకనిపించుకొంటాను.

సో :- అందుకని దాన్నింటిలో పెట్టుకొంటావా. ఆకుర్రాణ్ణి-

శే :- ఆకుర్రాణ్ణి- చెప్పవేం- చంపెయ్యమంటావా- మామా! నీకింతవయస్సువచ్చింది. ముగ్గుర తల్ని చేపట్టేవు- పిల్లల్ని కూడా కన్నావు- ఆమాత్రం జ్ఞానంలేదూ- హృదయంలేదూ- ఆపసిగుడ్డు నిన్నేమిచేసిందని చంపడానికి పూనుకుంటావు. ఆ శిశువు-

సో :- ఏమిచేసిందా- కఠోరరూపందాల్చి మాఅబ్బాయి పెండ్లి ఆపేసింది.

శే :- మీఅబ్బాయిపెళ్లి ఆపిందని పెచ్చుపెరిగిన స్వార్థంతో అన్నము పున్నెము ఎరుగని అమాయికశిశువు నిండారు ప్రాణాలు తీయడానికి తలపెట్టావా- హుం (గర్జిస్తాడు).

సో :- (శాస్త్రి కేసి తిరిగి) బావా- మాటాడవేం- ఈసంగతి వ్యాపిస్తే మాఅబ్బాయిపెళ్లి...

(బయటనుండి ' శాస్త్రిగారూ! శాస్త్రిగారూ ఉత్తరం '' అని వినిపిస్తుంది. శాస్త్రి వెళ్లి ఉత్తరంతో వస్తాడు)

శా :- (చూచి) బావా! నీకు Express ఉత్తరం.

సో :- ఏదీ (తీసికొని చింపి- కాగితంతీసి చదివి "అయ్యో!" అని క్రింద కుప్పగా కూలిపోతాడు. నెత్తిన చేతులు పెట్టు కుంటాడు).

శా :- ఏం! బావా-

శే :- ఏం ! మామా-

సో :- ఏముంది (వణకు చేతులతో ఉత్తరం శాస్త్రికీయబో తాడు. శేషగిరి తీసికొని చదువుతాడు)

శే :- " నాన్నా.

నీవు వెళ్లిన మరునాడే నా సవతితల్లి ఎక్కడికో బట్టా పాతా తీసికొని ఇంటిలో చెప్పకుండా వెళ్లిపోయింది. ఈఇం టిలో కాపురంచేయడాని కిష్టంలేదనీ నాకోసం వెతకవద్దని ఉద్దేశపూర్వకముగానే వెళ్లిపోతున్నాననీ- ఉత్తరం వ్రాసి పెట్టింది. "

శా :- బాగానే ఉంది (నిట్టూరుస్తాడు)

సో :- గోరుచుట్టుపై రోకటిపోటు (లేస్తాడు)

శే :- ఇప్పుడేమంటావు. ఇందాకటినుంచి మా చెల్లిమీద విరుచుకుపడ్డావు.ఎలాచేస్తావు మీఅబ్బాయిపెళ్లి.మాచెల్లాయి విషయంకన్నా మాఅత్తయ్య విషయమే ముందుతెలుస్తుంది మీవియ్యాలవారికి- మీఅబ్బాయికి పిల్లనేలాఇస్తారు.

శా :- ఊరుకోరా శేషగిరీ-

శే :- అదికాదుసోన్నా- అప్పుడు నీకు ముప్పైఖరూడా దాట లేదట, ఎంతోమంది మళ్లీచేసుకోమని నచ్చచెప్పారట- నీవు

వినలేదట- "పిల్లలున్నారు- వీరి భావిజీవితం చూడవద్దా? నాసుఖాన్ని కాంక్షించి పెళ్లాడితే నాపిల్లల గతేమికాను" అన్నావట- ఆమాత్రంబుద్ధి మామయ్యకేది? (సోమయాజులుతో) "ఏబయ్యో పడిలోనున్నావు- అప్పుడే ఇద్దరయ్యారు. వంశం నశిస్తుందేమో అంటే కొడుక్కూడా ఉన్నాడాయె- వాడిపెళ్లిమాట ఆలోచించు నీకెందుకుపెళ్లి" అని త్రికాల సంధ్యల నీవు ఆరాధించే సంఘమే ఎంతవద్దన్నా విన్నావా? నీశరీర సుఖముందు దాని వేడికోలులు లెక్కా. నీకక్కర్లే నప్పుడు ఆసంఘాన్ని పాతచెప్పులా విడుస్తావు. కావలసివచ్చి నప్పుడుకౌగలించుకొంటావు. అంతవయస్సులో మామయ్యా! నీకాంక్షలే ఉడగలేదే-అన్నెము పున్నెముఎరుగని మాచెల్లి, లోకంపోకడ తెలిసికోలేని మాచెల్లి,ఏదో తెలియక. ఫలితాన్ని తెలిసికోలేక, ఏదోచేస్తే ఇంతరాద్ధాంత సిద్ధాంతమా. చూడు మామయ్యా-ఈపసిపాపవల్ల మీఅబ్బాయిపెళ్లి కాదంటున్నావు కదూ- ఇది పొరుగూరు- ఇక్కడ నిన్నూ నన్నూ తెలిసిన వాళ్లులేరు- ఇలాజరిగిందని అప్పుడే ఎవరికీ తెలియదు. నేను ఈరాత్రికిరాత్రి ఈపాపాయిని మాయింటికి తీసుకుపోతాను- సరా! మాబెడద మీకేమీఉండదు. మానాన్నకూడా పెళ్ళికి వస్తాడు తెలిసిందా- కిమ్మనకుండా చేసుకో మీఅబ్బాయిపెళ్ళి-

(ప్రవేశం సోమయాజులు కొడుకు రామారావు.)

రా :- (ప్రవేశిస్తూ) ఇంకెక్కడిపెళ్లి.

సో :- ఏం- ఏరా- నీవువచ్చావేరా

శా :– వచ్చాను నీకొంబోయే వియ్యంకుడు ఇస్తే టెలిగ్రాం పట్టుకువచ్చా (అనిఇస్తాడు).

సో :– ఏమనివార్రాశాడు గా

శే – (పుచ్చుకొని) ఏమనా (విప్పిచదువుతాడు)

" మీ తృతీయం లేచిపోయినట్లు విన్నాను. మీ సంబంధం మానుకున్నాము– మీమూలాన చాలాడబ్బు వృధా అయింది " అని

సో :– వ్రాయడుమరి– నా రాత.

రా :– నేనువస్తా–

సో :– వెళ్లుదువుగాని– ఇక్కడి సంగతి విన్నావా.

రా :– ఆ– మీకు Postman ఉత్తరం ఇస్తున్నప్పుడు నేను బయటేఉన్నాను. అంతావిన్నాను– మీమాటలు బావమాటలు– సరే వస్తాను మామయ్యా? నమస్కారం– వస్తా శా వా–

శా :– వచ్చినట్లే వెళ్ళిపోతున్నావే రా ?

రా :– (వినకుండా గుమ్మందాకా అడుగుల్లో అడుగు వేసుకొంటూ వెళ్ళి మళ్ళీ అలాగేతిరిగివచ్చి) నాన్నా !

సో :– ఏరా

రా :– నేనోమాట చెప్పుతాను వింటావా ?

సో :– ఎప్పుడు వినలేదు–

రా :– ఎప్పుడు విన్నావులే– చిన్నప్పుడు సరోజను పెళ్లాడుతానంటే–

శే :– ఎందుకు వింటాడు– కట్నం– ఆశ.

శా :- మనంమాత్రం ఏంతక్కువిచ్చాం కట్నం.

సో :- ఇప్పుడెందుకురా- గత జలసేతుబంధం-

రా :- గతించిన జలాన్ని వెనక్కితోడి సేతువును బంధించడంలోనేఉంది.

శే :- బాగాచెప్పావు

సో :- మీమాటలు నాకర్థంకావడంలేదు.

రా :- నీకర్థంకావులే (శాస్త్రి కేసిచూపించి) చూడుమామయ్యా నీకభ్యంతరంలేకపోతే సరోజను నేను పెళ్ళాడుతాను.

శాస్త్రి } (దిగ్భ్రమతో) ఆఁ-
శేషు }

సో :- ఈపరిస్థితుల్లో- సంఘం- నీకేమయినా మతి భ్రమించిందా ?

రా :- ఊరుకో నాకాదు భ్రమి స్తే.

సో :- ఆఁ-

శే :- " ఆఁ- " అంటావేమిటి మామయ్యా ! ఎన్నాళ్లు పాత భావాలను పట్టుకొని ప్రాకులాడుతావు- సంఘానికి వెరచి దానికి దాసోహమన్నకొద్దీ అది తన ఇనుపపాదాలతో మెట్టివేస్తూ భీషణ తాండవం చేస్తుంది. వెధవసంఘం- మొక్కుతున్నకొద్దీ కాలితోతొక్కివేస్తుంది- దాన్ని విడిచిపెట్టు- ఎంతమంది సుకుమార హృదయాలు ఏహ్యమైన దాని బలిపీఠానికి ఆహుతియయ్యారో గతచరిత్ర ఓసారి తిరగవేయి, ఈనాటి నీపరిస్థితి ఆలోచించు- ఈనాటి యువకుల భావాలు

ఎలాపరవళ్లుత్రొక్కుతూ ముందుకుసాగిపోతున్నవో గమనించు- నీకు మీఅబ్బాయి సుఖంకావాలా- సంఘంకావాలా- మీ ఆవిడ లేచిపోయిందన్న సంగతి విస్మరించావా- మీ అబ్బాయి పీటలమీద పెళ్ళి ఆగిపోయిందన్న సంగతి విస్మరించావా- ఈ విషమపరిస్థితుల్లో ఎవడయినా మీఅబ్బాయికి పిల్లనిస్తాడేమో ఆలోచించావా- సంఘంనిన్ను పెంచిపోషించడం లేదుకదా- నీ కాళ్ళమీద నిలబడగల శక్తి సంపన్నత నీకున్నదిగదా- చూడుమామయ్యా! చిన్నవాడినో పెద్దవాడినో చెప్తూవు న్నాను- ఇప్పటికయినా సంఘాని కెదురీదు.

సో :- ఇంతకాలానికి సంఘానికెలా ఎదురీదనురా (చతికిలబడి నెత్తికొట్టుకుంటూ) మాఆవిడ లేచిపోయింది. మాఅబ్బాయి పెళ్ళి ఆగిపోయింది.

రా :- మాటాడవేం మామయ్యా! చూడు చిన్నప్పటినుండీ సరోజంటే నాకెంతఇష్టమో నీకుతెలుసుగా- చిన్ననాటినుండి ఒక్కచోట ఆడుకున్నాము. పాడుకున్నాము. మాఅత్తయ్య ఏమనేది- "మాసరోజని రామారావుకిచ్చి పెండ్లి చేస్తాము. చక్కగా ఈడుజోడు" అనేదికదూ అమ్మలక్కలతో. కానీ తీరా సమయానికి కట్నంకట్నంఅని అంగలార్చాడుగానీ నామనోవేదనల్ని ఏమయినా గ్రహించాడా మానాన్న- అప్పుడుకూడావచ్చి ఏమన్నాను నీతో-జ్ఞాపకముందీ- కట్నం వద్దూ కానుకలువద్దూ నేనువచ్చేస్తా సరోజనిచ్చి పెండ్లి చేసి వేయిమామయ్యా!" అని ఇష్ట డడిగినట్లే అడిగాను-

జ్ఞాపకముందీ-

శా :- జ్ఞాపకంలేకేరా_ బావతో విరోధం తెచ్చికోవడం ఇష్టంలేక-

రా :- ఇంకోరికిచ్చి సరోజని—

శా :- పెళ్లి చేశా- చేసి ఏంబాముకున్నా- ఇదిగోపరిస్థితి-

రా :- పరిస్థితి ఏంతారుమారైనాసరే- ధైర్యంచాలక ఇప్పటికే జీవితాన్ని మధన పెట్టుకున్నాను- ఇప్పుడైనా సాహసించకపోతే జీవితాంతం మనోవేదనలతో మగ్గిపోవలసి వస్తుంది- ఏపరిస్థితిలోఉన్నా సరోజన్నే పెళ్లాడతా- చెప్పు- మాటాడవేం మామయ్యా-

శా :- నేను మాటాడేఘట్టం గడిచిపోయిందిరా బాబూ- జీవచ్ఛవాన్ని నేను (శేషగిరి కేసిచూపి) అడుగో! వాడితో మాటాడు.

రా :- ఏం బావా?

శే :- నేనెప్పుడు కాదన్నాను- కానీ అన్నీ ఆలోచించుకున్నావా- దీనివల్ల కలిగే కష్టనష్టాలు గ్రహించుకొన్నావా-

శా :- నీవేనా సంస్కారివి.

శే :- కాదు- నీవే- పరిస్థితులవల్ల నేను సంస్కారిని కావచ్చు- కానీ- ఆచరిస్తూన్న యదార్థసంస్కారివి నీవే-

శా :- అయితే ఈపిల్లాడు.

శే :- నేను తీసికోనిపోయి పెంచుకుంటానని చెప్పానుగదా మామయ్యా-

శా :- బాగు! సరోజకొడుకుని నీవు పెంచుకోవడమేమిటోయి

భావా- మేమే పెంచుకొంటాము- నీ పాపసిగ్రుడ్డుని తీసికొని వెళ్లితే ఆకన్నతల్లి హృదయం భరిస్తుందా- అన్నట్టు ఈ గొడవలోపడి ఒకసంగతి చెప్పడం మరచిపోయాను.

సో :- ఇంకేమిటిరా ?

రా :- ఆటెలిగ్రాముతోపాటు నాకు ఉద్యోగం అయినట్లు ఆర్డరుకూడా వచ్చింది.

శే :- ఏ ఉద్యోగం.

రా .- సెంట్రల్ ఎక్సైజు ఇనస్పెక్టరు.

శా :- ఎక్కడరా బాబూ-

రా :- నాగపూర్ లో- నేనింక పదిహేను రోజుల్లో వెళ్ళిపోవాలి. ఇక్కడ తంతుఅంతా అయినతరువాత త్వరగా ముహూర్తము చూడండి. నాతోపాటు నాగపూర్ తీసుకుపోతా సరోజను.

సో :- నాగపూర్ తెలుగుదేశంకాదు- ఇదీ ఒకందుకు మంచిదే.

రా :- నాగపూర్ గానీ, నాగులపల్లెకానీ, సరోజను నేను పెళ్ళాడితీరతాను. ఏవ్యక్తి ఏసంఘం అడ్డువస్తుందో చూస్తా ఇదివరకులా అస్వతంత్రుణ్ణికాను. నాలో ఒదిగిఉన్న స్వతంత్ర భావాలు రెక్కలుదాల్చేయి. ఒకరి ప్రమేయంలేకుండా నా కాళ్ళమీద నిలబడేశక్తి కలిగింది. ఏదైనా ఒక సంస్కారాన్ని ధైర్యంగాచేస్తే కాకుల్లాపొడుస్తుంది ఈ సంఘం. అదే

చాటుమాటుగా చేస్తే సంఘం చూచీచూడనట్లు ముసిముసి నవ్వులు నవ్వుతుంది. అనూచానంగా వస్తున్న ఈ నీచ ప్రవృత్తి మారాలి. అప్పుడుగాని ఈ సంఘం– ఈ సంఘంలోని మనుష్యులు—— ......

(తటాలున తలుపుతోసికొని చిరునవ్వుతో అవధాని ప్రవేశిస్తూ)

అ :– బాగుపడరు– మీకందరకు నమస్కారాలు (శాస్త్రి తప్ప అందరూ విస్తుపోతారు.)

అ :– నాకు చాల సంతోషంగా ఉంది ఈవేళ– చూచారు– మీకు మనుమడు పుట్టేడా

శా :– ఆ——

అ :– శుభం! ఇవాళ కలిగిన నా సంతోషాన్ని ఎలా అభివ్యక్తం చెయ్యాలో నే నాశుకవి నయినప్పటికి నా నోట మాటలు పెకలడం లేదు అంటే నమ్మండి నామాట.

శా :– ఆ సంతోషానికి—— ...

అ :– కారణమంటారా– చూచారు– నేను నాటిక ప్రాశానని ఇంతకుముందే చెప్పేను- జ్ఞాపకముందీ?

శా :– ఆ– కొంత రిహార్సల్సుకూడా వేసినట్లున్నారు.

అ :– ఆ, ఆ!

శే :– ఎందుకువచ్చిన గొడవయ్యా! ఈసమయంలో——

అ :– ఈ సమయానికేం– శుభసమయం– మీరు మాటాడకండి. దయచేసి ఒక్క-నిమిషం– నేను మీ ఇంటి యజమానిని లెండి. (శాస్త్రితో) చూచారు– శాస్త్రిగారు– ఆ నాటకం

ఆదినుంచి కొంతవరకు మహాభాగా నడిచింది. అదంతా మీ అమ్మాయి జీవిత ప్రతిబింబమంటే నమ్మండి. నా కెలాస్ఫురించిందో ఏమోగాని నాకే ఆశ్చర్యంగాఉంది. అందుకనే కాబోలు పెద్దలు " నానృషిఃకురుతే కావ్యమ్ " అన్నారు. మన Tagore ఏమన్నాడు Poet is a Seer అన్నాడు.

శే :- ఇంటియజమాని అయితే అయ్యారుగాని-

అ :- ఉష్! ఉండండి కొంచెం- చూచారు- శాస్త్రిగారు- ఆ నాటకం అంతం ఎలాచెయ్యాలో తెలియక చాల తికమక పడ్డానంటే నమ్మండి, చివరికి ఆ అమ్మాయిని నమ్మించి మోసగించి వెళ్ళిపోయిన కుర్రాడినే పిలకపట్టుకొని లాక్కొచ్చి పెండ్లిచేయించా. కాని నాకది ఏమాత్రం నచ్చలేదు. చాలా పేలవంగా అందరుకవులు ముగించినట్లే అతి సాధారణంగా ఉంది. అందుకనే తక్కిన నాటకం రిహార్సల్సు మానేశా- చూచారు శాస్త్రిగారు- మీ సంభాషణలు- మీ కాబోయే అల్లుడి సంకల్పం విన్నాను- నా నాటకం అంత్యభాగాన్ని చించి పారేసి మీరు, మీ జీవితసమస్యను పరిష్కరించుకున్న ప్రకారం మళ్ళీ తిరిగి వ్రాసి ముగిస్తా. నా నాటకానికిప్పుడు ఆది-అంతం- ఆద్యంతాలు చాలా రసవత్తరంగా ఉంటాయి. అందుకు నా సంతోషం- ఈ నా సంతోషంలో కాబోయే నూతన దంపతులకు నా శుభాశీర్వాదులు- వెళ్ళివస్తానండి- చూచారు- మా తాతయ్యాఉంటే మీ మనుమడికి చక్కటి జాతకం వ్రాసేవాడు. వస్తానండి- నమస్కారాలు అందరికీ-

(నిష్క్రమణ.) (తెర చరచరా పడుతుంది)

# అపశ్రుతి

రచన 5—8—54

పాత్ర సూచి:—

రాఘవరావు ...

సుభద్ర ... రాఘవరావు భార్య

ఉష ... రాఘవరావు స్నేహితురాలు

నటేశం ... హోటలు సర్వరు

రంగము :- చెన్నపట్నంలో మోడరన్ హోటలు- అందులో మేడమీద విశాలమైనగది- కాలింగుబెల్ టెలిఫోను తోసహా సమస్త ఆధునికమైన సామాను ఉన్నది. మంచం గోడకానుకొని ఉన్నది. చక్కగా సర్ది ఉన్నది, పైన ఫేను తిరుగుచున్నది. ప్రేక్షకుల కెదురుగా రెండు కిటికీలు తెరచిఉన్నవి. ప్రక్కగా ద్వారమున్నది. ఎవరువచ్చినా వెళ్ళినా ఆ ద్వారంలోనుండి రావడం- పోవడం. మంచానికి ఆరడుగుల దూరంలో టీపాయి దానికిచుట్టూ రెండుకుర్చీలు పూలదానుకి వేలేబల్ల గోడనానుకొని- దానిప్రక్కనే అద్దం ఉన్నడ్రాయరు- దానిపైన టాయిలెట్ సామాను-

రాఘవరావు :- 45 సంవత్సరాలు, పొట్టిలోనే జమఅయినా పైకి దువ్వడంచేత అంతపొట్టి అనిపించడు. లావుకాదు కాని బొద్దు, టకప్‌లో ఉంటాడు.

సుభద్ర :- 35 సంవత్సరాలు, ఛామనఛాయ- బయటకు

వెళ్ళడానికి ముస్తాబుఅయి ఉంటుంది. ప్రాత క్రొత్త సింగారిం పుల మిళాయింపులలో అలంకరించుకొంటుంది. టీపాయ్ దగ్గరనున్న కుర్చీలలో కూర్చునిఉంటారు. వారు కాఫీ త్రాగుతుంటారు. రాఘవరావు చేతిగడియారం చూస్తుంటాడు మాటిమాటికి (తెర లేస్తుంది)

సు :- (కాఫీ గుక్కెడు త్రాగి) మీరూ రాకూడదూ.

రా :- (కాఫీ ఒక్కగుటకలో త్రాగివేసి, కప్పులు బల్లమీద పెట్టి) చెప్పలే- చాలా-

సు :- ఎప్పుడు లేదులెద్దురు పని

రా :- చెన్నపట్నం ఎందుకువచ్చాము- సర్కారువారి పని మీదేనా- అందుకనే-

సు :- రావద్దన్నారు నన్ను

రా :- అదికాదు, అదికాదు. పట్నంవచ్చామన్న మాటేగాని అసలు పనిచూచిందేది- సినిమాలని, బీచిపికార్లని మార్కెటింగ్ అని వీనితోటే సరిపోయింది- ఈ రెండురోజులు చూచుకోవలసిన పని ఎక్కడిదక్కడే- చూచి మాటాడవలసినవాళ్ళున్నారు చాలామంది. చెప్పానుగా మూడున్నర గంటలకు ఒక ఆఫీసర్ని ఇక్కడ కలిసికోమని ఎంగేజిమెంటు ఇచ్చానని.

సు :- అయితే నేనూ మానేస్తా.

రా :- అబ్బే! అబ్బే- మళ్ళీ మొదటికివచ్చావు. (లేస్తాడు) మన ఇద్దరిలో ఎవరోఒకరు వెళ్ళకపోతే ఏం బాగుంటుంది.

మాటఇచ్చాక. వెళ్ళిరా- నామాటవిని- అదీగాక వాళ్ళు నీ దగ్గరిచుట్టాలేగా !

సు :- భోజనానికి ఉండిపొమ్మంటారేమో

రా :- ఈ హోటలు సాంబారుమెతుకులు ఇవ్వాళ్ళనా తప్పుతవి.

సు :- భోంచేయనుబాబు మీారులేకుండా

రా :- పోనీ భోంచేయకుండానే వచ్చేయి (గడియారంచూచి గుమ్మంకేసి చూస్తాడు) మూడు దాటింది. మనం మూడింటికల్లా వారింటిదగ్గర ఉంటామన్నాం

సు :- అన్నవన్నీ జరుగుతున్నాయా.

రా :- లేదనుకో.

సు :- మరి !

రా :- మాటలతో——

సు :- అదిగో నా మాటంటేనే——

రా :- ఇష్టంలేకుంటావు. ఎలా పుష్కరంన్నర చేశాను కాపురం నీతో,

సు :- కర్మంకాలి

రా :- ఎవరిది

(ప్రవేశం) నటేశం- కాఫీట్రే తీసుకుపోనాసార్ ?

రా :- ఆ- ఆ- తీసుకుపో బల్ల శుభ్రంచేసి మరీతీసుకుపో

నటే :- ఆమాసార్, (కప్పులు సర్దుతుంటాడు)

రా :- (టెలిఫోను దగ్గరికివెళ్ళి డయిల్ త్రిప్పి) 2-3-4 ప్లీజ్

ఆ- 2-3-4 (చెవిదగ్గర రిసీవరుపెట్టుకొని) హల్లో హల్లో ఆ- ఆ- విశ్వంగా రేనా- ఆ- ఆమీ యింటికి రావడానికి వీలు లేకపోయింది క్షమించాలి. క్షమించాలి. ఆ- ఆఫీసుపని- ఏలాట్ (భార్యాకేసిచూస్తూ) మా ఆవిడ బయలు దేరు తున్నది- ఆ- ఈసారి క్షమించండి- మేం పట్నంవిడచి వెళ్లే లోగా- అలాగే- అలాగే- తప్పక- తేంక్ యు.(రిసీవరు క్రింద పెట్టి) సుభద్రా! వెళ్ళిరా నీకోసం స్టేషనుకు కారు పంపిస్తా రట. 3½ కి సరిగ్గా బయలు దేరుతుంది ఎలక్ట్రిక్ ట్రయిన్ మాంబళానికి

నటే :- (అన్నీ ట్రేమీద సర్దుకొని) రైళ్లు సరిగ్గా పూడ్చేది లేదుసార్. (నిష్క్రమణ)

సు :- (లేచి అద్దందగ్గరకువెళ్లి సరిదిద్దుకొని) అయితే వెళ్ళి రమ్మంటారా.

రా :- నేను రాకపోయినందుకు క్షమార్పణ చెప్పు.

సు :- (గునుస్తూ) ఒక్క తెనే వెళ్ళడం——

రా :- భయమా! ఇంత మహాపట్నంలో భయమేమిటి అయినా నీ కలవాటేగా- మీ నాన్న డిప్యూటీకలక్టరుగా ఈ ఊళ్ళో పనిచేసినరోజుల్లో——

సు :- అది చిన్నతనం.

రా :- ఇది పెద్దతనం (నవ్వుతాడు)

సు :- అయితే వెళ్ళనా మరి (గోడదగ్గరనున్న జోళ్లు తొడు క్కుంటుంది) చూడండి నేను వచ్చేసరికి మీ రిక్క డేఉంటారా

రా :- మంచిదానవే !

సు :- ఆ- అడుగుతున్నా- మీ కలవాటుగా.

రా :- సరి- సరి ఇక్కడకూడానా. ఇంకేమీ పనిలేదు. ఈ ఆఫీసర్ వెళ్ళిపోగానే

సు :- ఇంకో ఆఫీసర్

రా :- లేదు, లేదు ఇంకేమీ పనిలేదు చెప్పాగా- వీలుగా ఉంటే సాయంకాలం సినీమాకి (గడియారం, ద్వారం చూస్తాడు)

సు :- మాటిమాటికి టైముచూస్తున్నారు. నేను వెళ్ళాలని తొందరగా ఉన్నట్టుంచే.

రా :- నాకేంతొందర, నీకు ట్రెయిను.

సు :- ఈట్రయిన్ కాకపోతే ఇంకో ట్రెయిన్ ఆయె.

రా :- అవునులే- మళ్ళీ వచ్చేటప్పుడు—

సు :- ఆలశ్య మవుతుందనా !

రా :- ఆ- ఆ- వెళ్ళేదానవు త్వరగా-

సు :- వెళ్ళివస్తా (తలుపుదగ్గరకు వెళ్లుతుంది నటేశం తలుపు త్రోసికొని పూలగుత్తులతో ప్రవేశిస్తాడు).

రా :- శకునం మంచిదే

సు :- శకునాలికేంగాని- (నటేశంతో) అప్పుడే ఎందుకు తెచ్చావు కదంబం- సాయంకాలం- రాఘవరావుకేసి చూస్తుంది)

నటే :- దొరగారు సరిగ్గా మూడుంకాలుకి కదంబం తెమ్మ

న్నారు, (అని వేసులో సర్దుతుంటాడు)

రా :- ఆఫీసరు వస్తున్నాడుగా! టైముచూచి వెళ్ళి త్వరగారా

సు :- చూడండి. నే వచ్చేటప్పటికి ఎక్కడికి వెళ్ళకండే వస్తా

(నిష్క్రమణ)

నటే :- (పూలుసర్దుతూ) ఎవరన్నా వస్తారేమిటిసార్

రా :- ఆ

నటే :- ఎవరుసార్

రా :- ఎందుకు నీకు

నటే :- అది కాదుసార్, కాఫీ టిఫిను తెద్దామని

రా :- సరే సరే! సరిగ్గా నాలుగు గంటలికి రా.

నటే :- అమాసార్ (వెళ్ళిపోబోతూంటాడు.)

రా :- (అద్దందగ్గరకువెళ్లి చూచుకొంటూ) బాయ్

నటే :- (తిరిగి) వచ్చేసార్.

రా :- బల్లమీాద అగరవత్తులున్నాయి తీసి నాల్గు వెలిగించు

నటే :- సరిదా- (బత్తులుతీసి వెలిగిస్తూ) ఆడవాళ్లాసార్ వచ్చేది.

రా :- ఎలా తెలిసింది.

నటే :- నాకు తెలుసుసార్, తెలియకేంసార్, మంచివాసన మైసూరుఅగ్గాబత్తి

రా :- సరేవెళ్లు సరిగ్గా నాల్గుగంటలకి

నటే :- అమాసార్

రా :- (టైముచూచి పంట్లాము జేబుల్లో చేతులు పెట్టుకొని.

కిటికీదగ్గరకువెళ్ళి కిటికీలోంచి చూస్తుంటాడు. నటేశం నిష్క్రమించబోతుండగా ఉష ప్రవేశం. అలంకారం ఆధునికంగా ఉంటుంది. చేతులో బేగ్ ఉంటుంది. వయస్సు 30 సంవత్సరాలు.

నటే :– అమ్మాణీసార్ ! (ఉషతో) దొరగారు ఎదురుచూస్తుండారు, మీకోసం– నమస్కారం (నిష్క్రమణ)

రా :– (చటాలున వెనుదిరిగి ముందుకువచ్చి ఆప్యాయంగా) వచ్చావా.

ఉ :– రావద్దన్నారా

రా :– రమ్మనేగా వ్రాస్తా

ఉ :– అందుకేగావస్తా. (నవ్వుతుంది.)

రా :– (నవ్వుతాడు) (ఉష, రాఘవరావులిద్దరుకలిసి నవ్వుతారు. రాఘవరావు ఉష చేయిపట్టుకొని కుర్చీదగ్గరకు తీసికొనివచ్చి)

రా :– ఇలాకూర్చో ఎక్కడదిగావు.

ఉ :– సగాసరి ఇక్కడికే

రా :– కాదులే

ఉ :– ఎలా అనుకున్నారు

రా :– ఇంత టిప్‌టాప్‌గా– చెక్కు చెదరకుండా

ఉ :– అబ్బా– Y. W. C. A..లో రాననుకున్నారా.

రా :– కొంచెం–

ఉ :– అనుమానించారా ?

రా :- లేదు కాని ఇలా కూర్చో

ఉ :- (చేతిలో బేగ్ బల్లమీద పెట్టి కుర్చీలో కూర్చుంటూ) ఎప్పుడూ అనుమానమే మగవాళ్ళకి.

రా :- మీకుండనట్టు మహా- బాయ్‌ని పిలువనా- కాఫీ- ఏమైనా

ఉ :- ఇప్పుడే నేను బయలు దేరి వచ్చేటప్పుడే (గదిఅంతా కలయచూస్తుంది. అద్దం దగ్గర ఆడవాళ్ళ టాయిలెట్ సామాన్లు రిబ్బనులు తలసూదులు కనుపిస్తవి) మీరొక్కరే రాలేదన్న మాట.

రా :- ఎలా పసికట్టావు.

ఉ :- పసికట్టడం స్త్రీలకు వెన్నతో పెట్టిందేగా. (కొంత మార్పు ముఖములో మాటల్లో వస్తుంది, లోపల బాధపడడం వల్ల) అయితే- నన్నెందుకు—

రా :- రమ్మన్నానంటావా

ఉ :- అదే.

రా :- (ఉమదగ్గర నిలబడి) నేనొక్కణ్ణే బయలు దేరేదే, అసలు అలాగే కాదు వ్రాస్తనీకు- నేను బయలు దేరేవరకు మా ఆవిడ గారు వస్తున్నట్లే తెలియదు. బండివచ్చి గుమ్మంలో నిల బడింది. ఈవిడ సూట్‌కేస్‌తో తయారు. ఎంతవద్దన్నా వినందే. మంకుపట్టు పట్టింది. నేనేం చెయ్యను.

ఉ :- (నిట్టూర్చి) సరి, ఉత్తరం—

రా :- అనుకున్నా- టైం లేకపోయింది.

ఉ :- మరి.

రా :- చుట్టాలింటికి వెళ్లింది.

ఉ :- మీరు వెళ్ళలేదేం

రా :- (ఉష కేసి చూస్తూ) నీవు వస్తున్నావుగా

ఉ :- ఏం ప్రేమ. అందుకని-

రా :- మా ఆవిణ్ణి పంపించివేశా.

ఉ :- మంచిపని చేశారు.

రా :- కాదా. (ఆమె వెనకాల నిలబడుతాడు)

ఉ :- మళ్లీ ఎప్పుడు వస్తుంది.

రా :- అయిదు దాటుతుంది.

ఉ :- (నిట్టూర్చి) బాగుబాగు.

రా :- ఆగోడవకేంలే- ఎలావచ్చావు. చాలా సంతోషంగా ఉంది, చూడు. మీ- ఆయన-

ఉ :- అభ్యంతరపెట్టలేదా అంటారా- అబ్బే! వెళ్లిరా- ఆయన కష్టపడి ఉత్తరంవ్రాశారు. దారుణ విరహావేదనల్లో వేగివేగి మగ్గిమగ్గిపోతుంటారు- వెళ్లిరా- అంటె ఇలా చక్కా వచ్చాను.

రా :- చాల్లేగాని చెప్పుదూ (నవ్వుతూ)

ఉ :- ఏంచెప్పను. చెప్పాగా-

రా :- కోపంగా ఉందా.

ఉ :- దేనికి.

రా :- మా ఆవిణ్ణి తీసుకువచ్చానని.

ఉ :- (మాట్లాడదు)

రా :- సరేగాని, నా ఉత్తరం నీకందిందో లేదో అని చాలా ఆందోళనపడ్డా- అందితే తప్పక వస్తావని తెలుసు.

ఉ :- భర్తచాటు భార్య ఎలా వస్తుందనుకుంటారు.

రా :- నాకు తెలుసుగా వస్తావని- ఇవ్వాళ సరిగ్గా నాల్గు గంటలకల్లా ఇక్కడికి రమ్మని ప్రాణానుగా మన్నుల్ని ఇవ్వాళ టీకి ఆహ్వానించినవాళ్లు మా మామగారి దగ్గర బంధువులు, పోలీసు కమీషనరుచేసి రిటైరు అయ్యాడు. అక్కడ ఒప్పుకున్నానేకాని నేనుమాత్రం రావటానికి వీలు లేదని చెప్పా మా ఆవిడతో- మా ఆవిడ నేనొక్కతెనూ వెళ్ళనంది. బావుండదు నీవయినా వెళ్లకపోతే- వెళ్లిరా- ఈలోపుగా నాపనీ అయిపోతుంది- అన్నాను మొదట ససేమిరా వెళ్ళనంది. నాకు చెడ్డ దిగులు వేసింది. చెప్పొద్దూ చెప్పగా- చెప్పగా ఒప్పుకుంది వెళ్ళడానికి- కాని- ఎంతకీ బయలుదేరదే-

ఉ :- మీమీద ప్రేమ-

రా :- ప్రేమ- మూడుంపావు దాటిపోయింది. ఆవిడని కదలించేసరికి బ్రహ్మప్రళయ మయిందంటేనమ్ము. ఊఁ- నీవెలా వచ్చావో చెప్పవే-

ఉ :- రైలుబండెక్కి.

రా :- అదికాదు-

ఉ :- మా ఆయన

రా :- ఆ- ఆ-

ఉ :- మీ ఉత్తరం వచ్చింది- చూచాను- తప్పక వస్తానని మాట ఇచ్చానుకదూ మీకు- పుట్టింటికి వెళ్లివస్తానని చెప్పాను మా ఆయనతో. ఇప్పుడెందుకు మామగారు కులాసాగానే ఉన్నారుగదా అన్నారు. అదికాదు- మా నాన్నను చూడాలని మనస్సు పోయింది అన్నాను.

రా :- ఆడాళ్లు బొంకితే గోడపెట్టినట్లట.

ఉ :- కాదుమరీ! వినండీ- పదిరోజుల్లో సెలవుపెట్టి నేనూ వస్తా; అప్పుడు వెళ్లుదాం అన్నారు. అలాకాదు; ఇవ్వాళే వెళ్ళాలన్నాను. ఆమధ్యాహ్నం భోంచెయ్యలేదుకూడ. ఎంతో బ్రతిమాలారు- ససేమిరా వినలే. రాద్ధాంతసిద్ధాంతాలయ్యాక చివరికి తెగించి ఇక్కడ నాకుండడం ఇష్టం లేదన్నాను.

రా :- అంటె ?

ఉ :- నిప్పులు గ్రక్కేటట్టుచూచి, "ఏమన్నావు ?" అన్నారు.

రా :- (ఆదుర్దాగా) ఏమన్నావు ?

ఉ :- ఇష్టంలేదన్నాను.

రా :- ఏమన్నారు

ఉ :- 'ఆలోచించుకొనే అంటున్నావా' అన్నారు. ఆ- అన్నాను, "నేనన్నానా" అన్నారు.

రా :- ఆ! —

ఉ :- ఆ- అన్నాను. ఆ మాటవిని చరచరా బయటికి వెళ్లి

పోయారు.

రా :- తరువాత.

ఉ :- తరువాత ఇంకేమిటి- స్టేషన్ కి చక్కా-వచ్చేశా-ఆయన-

రా :- ఊ- ఆయన-

ఉ :- తన బంట్రోతుని పంపారు.

రా :- (తొందరగా) ఎందుకెందుకు ?

ఉ :- 20 రూపాయిలు ఒక ఉత్తరం ఉన్న కవరిచ్చి నన్ను బండికి సాగనంపి వెళ్ళాడు.

రా :- ఉత్తరం ఏమని

ఉ :- ఇక్కడికి వచ్చేతొందరలో దానిని విప్పి చూడలే

రా :- ఎక్కడుంది ?

ఉ :- ఆ బేగ్ లో

రా :- (తీయబోతాడు)

ప్రవేశం :- నటేశం- నాలుగయిందిసార్. ఏమికావాలిసార్, దూద్ పేడ, బర్ఫీ, లాడు, బహదుర్ షా, పకోడీ, బోండా, రవ్వదోసె, అటుకులు ఏంకావాలిసార్.

రా : ఇవ్వాళ చేసిన స్వీట్, హాట్ రెండేసి, రెండేసి

నటే :- ఆమా- కాఫీ, టీ, సార్

రా :- నాకు కాఫీ- ఈవిడకి లెమన్ క్రష్ అంటే ఇష్టం. (ఉమతో) ఏం

ఉ :- నా యిష్టానికేమిలే- మీకిష్టమేదో తెప్పించుకోండి

రా :- తెప్పించుకున్నానుగా (ఉమ కేసిచూచి నవ్వుతూ)

బాయ్

నటే :- వస్త్రే సార్.

ఉ :- (నవ్వడు)

రా :- గదిఅంతా గత్తరగాఉంది. దాసీపిల్ల రాలేదే తుడవటానికి.

నటే :- (నవ్వుతూ) ఇంక రాదుసార్ - దానికి దాసీపిల్లంటే రొంబ కోపంసార్ -

రా :- ఎందుకు రాదు-

నటే :- మొగుడితో కయ్యామేసి చెప్పకుండా గిప్పకుండా పుట్టింటికి పూడ్చిందిసార్. పూడిస్తే దానిమొగుడు ఇవాళ వస్త్రేసార్. మన హోటల్ ముందేసార్ "హోటల్ తిళ్లు మరిగావా" అని నాల్గు లెంపకాయలు ఫెడీఫెడీమని తగిల్చి, జుట్టుపట్టుకొని బరబరా లాక్కుని పూడ్చాడుసార్ - ఇంకది రాదు సార్.

రా :- సరేగాని సోది- సాయంకాలం తుడవడానికి ఎవర్నయినా పంపు.

నటే :- దాని తల్లిని పంపేదిసార్.

రా :- త్వరగా వెళ్ళి కాఫీ.

నటే - ఆమాసార్ - (నిష్క్రమణ)

ఉ :- (నటేశం మాటలువిని ఆమె మొగం వంచుకుంటుంది.)

రా :- అలా దిగాలుగా ఉన్నావే-

ఉ :- దిగులు కే

రా :– ఏదో దీర్ఘాలోచనలో– పుస్తకాల్లో వర్ణిస్తారుచూడు– కనుబొమ్మలు పైకెత్తి, చెక్కిట చెయిచేర్చి– నిట్టూర్చి–

ఉ :– ఇంక ఆలోచన కేముంది– ఒకటే ఆలోచన– (నిట్టూర్పు)

రా :– ఇంక మీ ఆయనదగ్గరకు.

ఉ :– వెళ్లవా– అంటారా–

రా :– (చూస్తూ మాట్లాడడు)

ఉ :– వెళ్ళనా ?

రా :– అదికాదు– అంత తెగతెంపులు చేసుకొని–

ఉ :– మరెలా రావడం–

రా :– (నవ్వుతూ) ఎగిరి

ఉ :– మీకు నవ్వులాటే– నాకు–

రా :– ప్రాణం పోకడ–

ఉ :– ప్రాణంపోయినా బావుండేది– అంతకన్నా–

రా :– అంతకన్న–

ఉ:– గడ్డుసమస్య (హోరుగాలివీచి కిటికీతలుపులు కొట్టుకొంటవి– ఒక్కసారి గదిలో వస్తువులు గాలికి అల్లలాడుతవి.)

రా :– (కిటికీలు వేయడానికివెళ్లి తలుపులు పట్టుకుని) ఎంతలో మబ్బులు క్రమ్మాయి– హోరుగాలి!

ఉ :– (కిటికీకేసి చూచి) నేను బయలుదేరిన వేళావిశేషం. అప్పటి కేమబ్బులు లేవు–ఎంతలో ముసురుకొన్నవో–ఎంతలో గాఢంగా క్రమ్మివేశాయో–

రా :– ఇంకోక్షణంలో– (తలుపులు వేస్తాడు.)

ఉ :- తుఫాను-

(ప్రవేశం- వటేశం ఫలహారాల ప్లేటుతో) రొంబ వర్షం వస్తుంది సార్ (సామాను బల్లమీద సర్దుతూ) నాకు వర్షంఅంటే బలేసరదాసార్ (అన్నీ సర్ది) రెడీసార్

రా :- (పరికించి) కిళ్లీలుకూడా తెచ్చావే.

వటే :- నాకు తెలుసుసార్.

రా :- నీకన్నీ తెలుసులాగుందే- అయితే వెళ్లిరా-

వటే :- ఆమాసార్. (నిష్క్రమణ)

రా :- (కుర్చీలో కూర్చుంటూ) తిను ఉషా.

ఉ :- నాకక్కర లేదు.

రా :- ఏం.

ఉ :- ఏమీ లేదు.

రా :- కొంచెమయినా తినుపోనీ.

ఉ :- నా కడుపు నిండుగా ఉంది- చెప్పేగా నేనువచ్చేటప్పుడు- (పెడమొగ మవుతుంది)

రా :- న్యాయమా!

ఉ :- న్యాయం? (కోపంగా)

రా :- అయితే నేనూతినను (లేచి ఆమెకుర్చీవెనక నిలబడి కొంచెంవంగి) కోపం దేనికి-

ఉ :- బాగా ఉంది- నాకు కోపం దేనికి-

రా :- మాఆవిడని తీసుకువచ్చాననా- ఆవిడ బయలుదేరే దాకా నాకు తెలియనే తెలియదు వస్తుందని- నేనేంచెయ్యను-

ఉ :- మీారేం చేస్తారు- ఒకరిఆవిడ ఇంకొకరికోసం రావడానికి స్వేచ్ఛఉన్నప్పుడు, మీాఆవిడ మీాతో రావడానికి ఆమాత్రం స్వేచ్ఛ లేదా?

రా :- అయినా ఇప్పుడేంవచ్చింది- (భుజంతట్టి- మంచం దగ్గరకువెళ్లి కూర్చుండి) ఇలారా- మాట.

ఉ :- (చూచి కోపంగా మొగంత్రిప్పుకుంటుంది.)

రా :- నిన్నే- ఇలారా- చూడు ఒక్కసారి మంచిమాట-

ఉ :- (నిట్టూర్చి) నాలుగయింది- నాలుగున్నరయింది-

రా :- అయిదవుతుంది-

ఉ :- అయిదయితే మీాఆవిడ-

రా :- ఆ- మాఆవిడ వస్తుంది- అందుకే ఇలారా-

ఉ :- తరువాత,

రా :- Y. W. C. A.

ఉ :- తరువాత (లేస్తుంది)

రా :- తరువాతా-

ఉ :- గంగలోకి- ఏం.

రా :- నే నన్నానా-

ఉ :- అనాలా.

రా :- ఆలాగయ్యావేం- వచ్చేటప్పుడెంతో ఆనందంతో-

ఉ :- వచ్చాను- భర్తతోపోరాడి- మళ్లీమొగం చూడనని- మీారంటే నాకసహ్యాం అని- నాబ్రతుకు భగ్నంచేసికొని- ఎంతో ఆనందంతో వచ్చాను.

రా :- అయితే ఇలాగా మరి- ఇంతకోపం-

ఉ :- కోపం- కోపంకాక- ఎంత స్వార్థపరులో మగవాళ్లు ఇవాళే తెలిసింది- ఇన్నాళ్లు మీవ్యామోహంలో (అని దూరంగావెళ్లి నిలబడుతుంది- నిట్టూరుస్తుంటుంది)

రా :- (లేచిదగ్గరకువెళ్ళి) చూడు (భుజంమీద చెయ్యి వేస్తాడు )

ఉ :- (చట్టునతిరిగి) దూరముగా ఉండండి- మీనిజహృద యాన్ని నగ్నంగా ఇవ్వాళ చూడగలిగాను- ఇన్నాళ్లు- ఇన్నాళ్లు- నాహృదయతంత్రిని మీటి, నాలో ఒదిగిఉన్న ప్రేమలక్ష్మిని మేల్కొలిపిన అనురాగమూర్తులని భావించాను. మీప్రణయలేఖలకు పరవశనై పరవళ్లు త్రొక్కాను. మీ ఉద్యోగంలోని డాబుదర్పాలకు మొదలంటా మోసపోయాను. మీమాటలు- మీచేతలు- (నిట్టూర్పును)

రా :- ఉషా, ఇప్పుడేమయింది. అంత ఉద్రేకం-

ఉ :- ఉద్రేకం- ఏమయిందా ? బ్రతుకు బగ్గంపాడయింది. మీ ప్రణయలేఖల్లో, మీ తీయనిమాటల్లో, స్వార్థం పుంజీభ వించుకొని కోడెత్రాచుల్లా బుసలు కొట్టడానికి చూస్తున్నదని గ్రహించలేకపోయాను. మీ ప్రేమ నిజంఅనుకొని. జీవితాంతం నన్నుద్ధరిస్తారని- నా తలపూవు వాడనీయరని మీతలపు ఛాయల్లో నాబ్రతుకును తెల్లార్చుకోవచ్చునని కన్నుల్లోపెట్టు కొని, కంటికి రెప్పలా కాపాడుతున్నా భర్తనువిడనాడుకొని నిండుసంసారాన్ని భిన్నాభిన్నంచేసుకొని-

రా :- ఇప్పుడేమయింది ఉషా- మళ్లీ -

ఉ :- మళ్లీ వెళ్లిపోనా- పాలు విరిగినతరువాత మళ్లా- వెళ్లిపోనా- ఎంతమాట సెలవిచ్చారు? ఎలాఅనగలిగా రామాట! నామీద నిజంగామీకు ప్రేమఉంటే, ఆమాట అనగలిగే వారేనా- మీతాత్కాలికవాంఛల్ని సమయించుకోవడానికి- పబ్బంనాడుకూడా పాతపెళ్లామేనాఅని- ఈపట్నంలో క్రొత్త స్త్రీలతో సింగారించుకొని బీచిపికార్లు కొట్టడానికి నన్నురమ్మని వ్రాసారా-

రా :- (నిర్ఘాంతపోయి,) తప్పే.

ఉ :- తప్పని ఒప్పుకుంటేపోయిందా- ఆతప్పు తెరవెనకాల ఒక ముగ్ధజీవితనాటకం ఎలా సమాప్తిస్తుందోఅని ఆలోచించారా? మీరెందుకాలోచిస్తారు. మీగూడుకట్టుకున్న ' స్వార్థం మిమ్మల్ని ఆలోచించనీయదు- అయినా ఆలోచనలతో మీకేమవసరం.

రా :- అలా మాటాడతావే- క్షమించు.

ఉ :-"తప్పు"-"క్షమించు"-మాటలతో జోకొట్టితే పరితప్త హృదయం పరవశమయి సేదలు తీరుతుందా- తీగలు సడలి అపశ్రుతి పలికిన హృదయవీణ మళ్ళీసరిపడుతుందా- చదువు కున్నారే- నన్నేఉద్దేశంతో రమ్మనివ్రాసారు?

రా :- ఈ రెండురోజులుఆనందంగా చెన్నపట్టణంలో-

ఉ :- హా-హా. ఏదోశాస్త్రంచెప్పినట్లుంది. రెండురోజుల ఆనందంకోసం-

రా :- అలాంటప్పుడు-

ఉ :- ఎలావచ్చాను- అవును- అలాంటప్పుడు ఎలావచ్చాను అనేదిప్రశ్న- ఆప్రశ్న ఎదురుతిరిగి నన్నే ప్రశ్నిస్తున్నది- ఎలావచ్చాను.

రా :- చూడు ఉషా- నామాటవిని శాంతించు.

ఉ :- మీమాటవిన్నా, మీరే నాసర్వస్వం అనుకున్నా. నాజీవితాంతం మీరే నాప్రణయనిధానం అనుకున్నా. అను కునే వారెంతగా ప్రేమిస్తున్నా కాలదన్నివచ్చేశా- వచ్చినం దుకు బాగామోసపోయా.

రా :- మోసపోవడానికి నేనేమిచేశా-

ఉ :- మీరేమీచేయలేదు మహాశయా! మీరేమీచేయ లేదు. మిమ్మల్ని తప్పుగాఅర్థంచేసుకొని అంతా నేనేచేసు కున్నా చేతులారా- చేసుకొన్నా నేనే (నిట్టూర్చి) ఏమిచే శాను మోసపోవడానికి- హుఁ-

రా :- ఆ- అవును-

ఉ :- అవునంటారేమిటిపైగా (నిట్టూరుస్తూ) అయిదయిం దాక మీతోకులికి, అయిదయిపోగానే మీఆవిడవస్తుందనే భయంతో బయటకువెళ్ళి నాదారినేనుచూచుకోవాలి పడపు కత్తెలా- పడపుకత్తెకయినా ధనంవెచ్చించాలి. నాకదేమీ అక్కరలేదు పడపుకత్తె కన్నా కనిష్టము, నీచం, అయ్యో! (మంచంమీదపడి వెక్కివెక్కి ఏడుస్తుంది)

రా :- (నిర్ఘాంతపోయి మంచందగ్గరకువెళ్లి ఆమెమీదచేయు

వేయబోయి, మానివేసి కిటికీదగ్గరకువెళ్లి తలుపుతీస్తాడు. గాలితోపాటు వర్షంకూడ జోరుగా వస్తుంది. మళ్ళీ తలుపువేసి మంచందగ్గరకువచ్చి ఉషభుజంమీద చేయివేసి) చూడుఉషా–

ఉ :– (చటుక్కనలేచి మొగం చెంగుతో తుడుచుకొంటూ) దూరంగా ఉండండి. నేను పడపుకత్తెనుకానని తెలుసుకోండి. ఇంతవరకూ మాటలునమ్మి మోసపోయా– మోసపోయి నాబ్రతుకునే మోసంచేసుకున్నా (అని పైటచెంగు మొగం మీద వేసికొంటుంది)

రా :– చూడుఉష– ఇంత ఉద్రేకం పనికిరాదు. శాంతంగా ఆలోచించు నాతప్పేమిటో–

ఉ – (మొగంమీదచెంగు చటాలునతీసి) మీతప్పేమీ లేదు. మీరు మగవారు. మీకోరిక తీరడంకోసం మీరు స్త్రీల అమాయక జీవితాలతో చెలగాటాలాడుతారు. ఆచెలగా టంలో ఎన్ని సున్నితమయిన జీవితాలు పరివేదనాహృద యంతో అవశవివశలై తపించి తపించి వెర్రెత్తిపోతవో మీకు అర్థంకాదు. ఒకవేళ ప్రయత్నించినా మీతప్పేమీలేనట్లుగానే కనిపిస్తుంది.

రా :– నాతప్పుందంటావా– అయితే నన్నేమిచెయ్యమంటావు సరిదిద్దుకోవడానికి.

ఉ :– బాగు– నేనాచెప్పేది– నిష్కృతి.

రా :– నేనెంత ఆలోచించినా తోచడంలే.

ఉ :– ఎందుకు తోస్తుంది– మీకుతోచేది ఒక్కటే!

రా :- ఏమిటి?

ఉ :- మీఆవిడ : కుండానే నేనిక్కడనుంచి- వెళ్ళిపోయే మార్గమే-

రా :- అబ్బా-

ఉ :- కష్టంగాఉందా?

రా :- (మాటాడడు)

ఉ :- నిజమాడితేనే ఇంత నిష్ఠూరమే- ఆనిజం మీప్రక్కలో బల్లెమయిందే- నేనిక్కడనుంచి వెళ్ళిపోయిన మరుక్షణం నాబ్రతుకు మహాశ్మశానమయిపోతుందే- ఎటుచూచినా ఎవరూలేని దిక్కులేని పక్షినయిపోతానే- ఆవిషయం మీరేమయినా ఆలోచించారా- ఆవిషయం మీకనవసరం- మీహోదాకు భంగంరాకుండా. మీసాంఘిక నైతిక జీవితానికి ఆటంకంరాకుండా-

రా :- సరే- నన్నిప్పుడేమిచేయమంటావు?

ఉ :- ఆప్రశ్నే మిమ్మల్ని వేయబోతున్నా- ఇలాచూడండి- మాఆయన్ని త్రోసిరాజని- నీవంటే నీ సంసారంఅంటే ఇష్టం లేదని- నదులుదాటి కొండలుదాటి- మైళ్ళకుమైళ్ళు చక్కావచ్చానే మీఅండచూచుకొని-

రా :- నేను అలా-

ఉ :- అలారమ్మన్నానంటారా (నిట్టూర్చి) ఎందుకురమ్మన్నంటారు- వచ్చి మీకోరికతీర్చి, మీదాంపత్యజీవితానికి భంగం రాకుండా నన్ను మళ్ళీనాగూటులోనికి వెళ్ళిపొమ్మంటారు.

అవునా ! నేను ఆడదాన్నయినా నాకూ హృదయముంది. మనస్సుంది. అభిమానముంది. ఇష్టానిష్టాలున్నవి. కాని- కాని అయ్యో (కుర్చీలో కూలబడిపోతుంది.)

(టెలిఫోనుగంట మ్రోగుతుంది.)

రా :- (ఉమదగ్గరకు వెళ్లేవాడల్లా టెలిఫోను టేబుల్ దగ్గరకు వెళ్ళి రిసీవరు తీసుకొని) హల్లో, హల్లో మీరా- విశ్వంగారా ఆ- నేనే మా ఆవిడ బయలుదేరింది అంటారా సరే- సరే- అలాగే చేరగానే తెలియచేస్తాతే కుయూ. (రిసీవరు హుక్కున పెట్టివేస్తాడు )

ఉ :- (లేచి) అయిదు దాటింది. మీ ఆవిడ వస్తుంది. నేను వెళ్ళిపోవాలి

రా :- (తిరుగుతున్నవాడు ఆగుతాడేగాని మాట్లాడడు )

ఉ:- మాటాడరే ?

రా :- అంతా నువ్వేమాటాడుతున్నావుగా.

ఉ :-చూచి, నవ్వి, గిలిగించి, బులిపించి, రేకెత్తించి వదిలారు- మరి నేను మాటాడక-

రా :-అయిందేదో అయింది. క్షమించి-

ఉ :-(నిట్టూర్చి) హా ! ఎంత తేలికగా అన్నారు- ఆమాట మనసున్న మగవారే అనగలుగుతారు అలా.

రా :-క్షమించమన్నాగా-

ఉ :-జరిగిన యావత్కాండం- గాలితెరలకు చెరిగిపోయే- ఇసుకబారిలోని అడుగుజాడలా- క్షమించడానికి నేనువర్సి-

రా :- (మౌనముద్రమాస్తాడు)

ఉ :- అయిదు కొట్టింది. మీావిడవస్తుంది. నేను వెళ్లిపోవాలి. నాఅడుగుజాడల్ని తుడుచుకుంటూ- నాస్మృతిచిహ్నాన్ని ఏమాత్రం మిగల్చకుండా వెళ్ళిపోవాలికదూ- వెళ్లిపోతా- వెళ్లిపోతా- నా చంచలత్వానికి మంచి బుద్ధిచెప్పారు. (నిట్టూర్చి) నాజీవితం పాడయితే పాడయింది. మీాజీవితంలో చిచ్చుపెట్టడం ఎందుకు. వెళ్ళిపోతా. నాజీవితవీణ అపశ్రుతి పలకనీ- (బల్లమీాదబేగ్ తొందరగా తీసికోబోతుంటే క్రింద పడి అందులోని టాయిలెట్ సామానుతో ఉత్తరంకూడ బయటపడుతుంది.)

రా :- (ఉత్తరం తీయబోతాడు.)

ఉ :- ఉంచండి- అక్కడ! ఆఉత్తరంముట్టుకోడానికి-

రా :- తాహత్తులేదు.

ఉ :- (ఉత్తరం తీసిచదివి, నిట్టూర్చి మడతపెట్టి బేగ్‌లోపెట్టి వేసి) వెళ్ళుతా- ఎప్పుడూ ఇలా అన్నెమూ- పున్నెమూ ఎరుగని అమాయక హృదయాలతో చెలగాటాలాడకండి. మీా తాత్కాలికోద్రేక- ఆనందాలకోసం నిండుసంసారాల్ని నిలువునా బలిపెట్టకండి. ఇతరులవద్దనుండి స్వార్థత్యాగాన్ని కోరినప్పుడు మీారూ త్యాగంచెయ్యడం నేర్చుకోండి.

రా :- (దీనంగా నిలబడుతాడు)

ఉ :- (దరికివచ్చి) కోపంవచ్చిందా- కోపంరాదుమరి, కోరిక తీరకపోతే- అనుకున్నట్లు జరగకపోతే- కోపంకాక- అస్సట్లు

8

మరచాను- ఉత్తరంలో ఏమున్నదోఅని మొదటనుంచీ ఉబలాటపడుతున్నారు. చూస్తారా.

రా :- అక్కర్లేదు.

ఉ :- అవును- ఇంక మీకెందుకు- అయినా మావారి అమృత హృదయం బోధపడుతుంది. మీకిష్టంలేకపోయినా వినండి చదువుతా. (బేగ్‌లోంచి ఉత్తరంతీసి)

"ఉద్రేకముతో వెళ్లుతున్నావు. మనసు కుదుటపడిన తరువాత సమస్తం నీకేబోధపడుతుంది. నీవన్నమాటలకు నేనేమీ బాధపడడంలే- ఎప్పుడువచ్చేదీ వైర్ చేయి."

చూచారా, వస్తా, దేవుడున్నాడు అమాయక హృదయాల్ని కాపాడడానికి. వస్తా. (వెళ్ళి మళ్ళీ వెనక్కి-వచ్చి) మీఆవిడ వచ్చేవేళయిందా.

రా :- (ఆత్రంగా) ఈపాటికి వచ్చేస్తూఉంటుంది.

ఉ :- వచ్చినదాన్ని ఎలాగూ రానేవచ్చాను. మీఆవిడను చూచి మరీవెళ్లుతా-

రా :- (మాటాడడు)

ఉ :- మాటాడరే-

రా :- ఏముంది ? మాటాడడానికి- నీయిష్టం-

ఉ :- ఏం నంగనాచికబుర్లండి- నీయిష్టం (తలుపు కేసి వెళ్లబోతుంది)

ప్రవేశం, (సుభద్ర తలుపు త్రోసికొని ఇరువురు చూచికొని విస్తుపోతారు.)

సు :- (లోపలికివచ్చి భర్తకు, ఉషకు మధ్య నిలబడి) మీా ఆఫీసరా ?

రా :- ఆడవాళ్లు ఆఫీసర్లు!

సు :- ఏం- ఈరోజుల్లో ఆడవాళ్లకే పెద్దపెద్ద ఉద్యోగాలు.

రా :- (నవ్వబోతూ) అవునులే, అవునులే!

సు :- ఎవరుమరి ?

రా :- అదే చెప్పబోతున్నా.

ఉ :- (ముందుకువచ్చి) వీరేనాఅండి- మీాభార్యగారు.

రా :- ఆ

ఉ :- ఆలాగయితే-

సు :- ఏమమ్మా.

ఉ :- మీారు నన్నెరుగుదురా ?

సు :- ఎరిగుంటే ఇన్నియక్షప్రశ్నలెందుకు ?

ఉ :- నన్నెరుగరన్నమాట! మీాఆయనచెప్పలే-

రా :- (విస్తుపోతాడు)

సు :- (భర్తకేసి చూస్తుంది)

రా :- చెప్పడానికి అవసరంకలుగలే!

సు :- ఈమె నిదివరకు మీా రెరుగుదురన్నమాట.

ఉ :- అబ్బే!

రా :- (తత్క్షణం) నాకేలా తెలుస్తుంది-

సు :- మీాఆయన చెప్పలేదా అని అడుగుతారే.

ఉ :- అదికాదండి- నేనెవర్నో తెలిసికోడానికి ఇంత రాద్ధాంతమెందుకండీ ?

సు :- మీరూ చెప్పరు- వారూ చెప్పరు మరి.

ఉ :- వారికేం తెలుసు చెప్పడానికి. ఒక్కటిమాత్రం తెలుసు.

సు :- ఏమిటి ?

రా :- ఏమిటి ?

ఉ :- ఏమిటని అడుగుతున్నారేమిటి ? మీకు తెలియదూ.

సు :- తెలిసే అడుగుతున్నా !

ఉ :- అది కాదండీ- నేను ఇన్సూరెన్సు ఏజంటు నని మీకు తెలియదా ?

రా :- (నిట్టూర్చి)

ఉ :- మరి !

రా :- అదే చెప్పుదామనుకుంటున్నా.

ఉ :- నేను మధ్యాహ్నం వస్తానని ప్రొద్దున్నే రింగ్ చేశాగా.

రా :- (సుభద్రతో) నీవు స్నానం చేస్తుండగా చెప్పారు. నీకు చెప్పడం మరచిపోయా.

సు :- మీకు మరీపరధ్యాన్నం ఎక్కువయిందీమధ్య

ఉ :- పురుషులు సహజంగా పరధ్యానస్థులు. చూడండి, నేను ఆల్ ఇండియా ఇన్సూరెన్సు కంపెనీలో ఏజంటుని. మిమ్మల్ని ఇన్సూర్ చేయిద్దామనే వచ్చాను. మీ వారిదివరకే చేయించారు మా కంపెనీలో- మీ చేత చేయించమన్నారు, ఇప్పుడు వస్తారు- అప్పుడు వస్తారు, అని మీ వారు చెప్తుంటే ఉండిపోయాను. మీ రెంతవరకూ లేదు. 5½ కి ఒక ఎంగేజిమెంటుంటె వెళ్లిపోతున్నాను మళ్ళీవద్దామని- ఇంతలో-

సు :- నేను చక్కా వచ్చేశా- అయితే మేంవచ్చినట్లు మీ కెలా తెలుసూ-

ఉ :- సెంట్రల్ స్టేషన్ లో క్రొత్తవాళ్లెవరెవరు దిగుతారో ఎక్కడెక్కడ బసచేస్తారో మాకంతా ఇట్టే తెలిసిపోతుంది.

సు :- ఈపాడుఊళ్ళో రహస్యంఅంటూ లేదన్నమాట- నిల బడేఉన్నారు.

ఉ :- కూర్చుంటా.

రా :- 5½ కి ఎంగేజిమెంటు

ఉ :- తరువాత చూచుకుంటాలెండి. ఇక్కడికీపని అయిపో తుందిగా (కూర్చుండి) మీరూ కూర్చోండి.

సు :- (సందేహిస్తూ, భర్తకేసి చూస్తుంది)

రా :- ఫరవాలే కూర్చో.

సు :- (కూర్చుంటుంది)

ఉ - మీ పేరు

సు :- సుభద్ర

ఉ :- సుభద్రమ్మగారు చూచారు

సు :- ఫలహారాలన్నీ అలాగేఉన్నాయే- ఆఫీసరు రాలే-

ఉ :- ఆఫీసరు వచ్చివెళ్ళాకే నేనూ వచ్చా-

సు :- ఆఫీసరుసంగతి మీకేం తెలుసు-

ఉ :- మీవారు చెప్పారు.

సు :- అయితే ఈ ఫలహారాలు (భర్తకేసి చూస్తుంది)

రా :- ఈ- ఈ-

ఉ :- నాకోసం తెప్పించారు- కాని-

రా :- ఎంత బ్రతిమాలినా తినందే.

సు :- క్రొత్త

ఉ :- మాకాపట్టింపు లేవండోయి మేము ఏజంట్లం.

సు :- అవును లెండి

ఉ :- అసలు సంగతేమిటంటే సుభద్రమ్మగారూ! చూచారా- మా కంపెనీ చాలాగొప్పది. కలకత్తా మొదలుకొని కేప్ కామరిన్ వరకు వ్యాపారసంస్థలున్నవి. 3500000 లక్షలు ప్రభుత్వంవారికి డిపోజిట్టు పెట్టాం. మేం మంచి బోనసుఇస్తాం-

సు ,- ఇన్సూరెన్సు చేయించకపోతే నష్టం-

ఉ :- అలా అడగండి చెపుతా, మొన్న ఖాజీపేటదగ్గిర రెయిల్ ఏక్సిడెంటు జరిగింది తెలుసుగా.

సు :- పత్రికల్లో చదివాను చాలా ఘోరం-

ఉ :- ఘోరం అంటారేమిటండీనెమ్మదిగా. ఘోరాతిఘోరం. అందులో ఒక సంసారంసంగతి చెప్తాతావినండి. భర్తా భార్యా నలుగురు పిల్లలు రైలు వెళ్ళుతుంది వేగంగా. పెద్దశబ్దం వినిపించింది. లైట్లు గప్పున ఆరిపోయాయి- హోరుగాలి- భోరున వర్షం, ఎవరేమయ్యారో ఏమిజరిగిందో ఎవరికీ ఏమీ తెలియదు. 12 ఏండ్లపిల్ల చెక్కు- చెదరకుండా పెట్టెల సందుల్లో! చూచారా చిత్రం.

సు :- భూమిమ్మీద బట్టకట్టాలని ఉంది.

ఉ :- ఆ పిల్లను రైల్వేవాళ్లు తీసుకువెళ్ళి వాకబుచేసారు.

నా అన్నవారెవరూ లేరు— దూరపు బంధువు, ఒక పేద ముసలమ్మ ఉన్నట్లు తెలిసి ఆమె కప్పచెప్పేరు. ఆ పిల్లతండ్రి రెవిన్యూ ఆఫీసరు, మా కంపెనీలో ఇన్సూర్ చేయించాడు. ఆ సంగతి ఎవరికి తెలియదు— ఒక గుమస్తాకుతప్ప. ఆ గుమస్తా మా కంపెనీతో కరెస్పాండు చేశాడు. చూచారా మేము ఆ పిల్లకు ఎంతడబ్బు ఇచ్చామో రు. 10687–10–6 లు పూవుల్లో పెట్టినట్లు ఇచ్చాం.

సు :— అదృష్టం.

ఉ :— అదృష్టం ఏమిటండీ— ఆ ఆఫీసరు ఎన్నాళ్ళయింది చేయించి ఇన్సూరెన్సుఅని అడగరే. నాలుగు సంవత్సరాలేకా – వాళ్ళ నాయన ఇన్సూర్ చేయకపోతే ఆ అమ్మాయిగతి ఏమిటో చెప్పండి.

సు :— నిజమే— నిజమే— అయితే నన్ను ఇన్సూర్ చేయమంటారా.

ఈ :— ఎందుకు వచ్చాననుకున్నారు మరి.

సు :— మా ఆయన.

ఉ :— మా ఆయన— మీా ఆయన (నవ్వుతుంది)

సు :— మీా ఆయన— అలా నవ్వుతారే!

రా :— (విస్తుపోతాడు)

ఉ :— నవ్వులాటలాగానే ఉంది బ్రతుకు (నిట్టూరుస్తుంది)

సు :— ఏమండీ, మీా బ్రతుక్కే—. సీతాకోకచిలుకలా. మీా ఆయనంటారేమిటి!

ఉ :- ఏం చెప్పమంటారండీ.

సు :- మీ ఆయనేంచేస్తున్నారు?

ఉ :- ఇన్ కమ్‌టాక్సు ఆఫీసరు.

సు :- ఆ! అయితే మీరు.

ఉ :- కర్మ.

సు :- కర్మకేంవచ్చిందండి, మిమ్మల్ని చూస్తే ఆడవాళ్ళకే భ్రమ-

ఉ :- (నవ్వుతూ) ఆడవాళ్ళకే!

సు :- అది కాదండి- ఏమిటో చెప్పండి-

ఉ :- మీ కెందుకంత కుతూహలం-

సు :- మిమ్మల్ని చూచినప్పటినుండి మీ విషయం తెలిసికోవాలని-

ఉ :- (రాఘవరావు కేసి చూస్తూ) చెప్పమంటారా

సు :- చెప్పండి.

ఉ :- ఏం చెప్పనండి ?- (నిట్టూరుస్తూ) నేనొక అభాగినినండి. భర్తఉండీకూడా అనాధని.

సు :- పాపం విడిచిపెట్టారా. మీ కేం వచ్చిందని- చూడ చక్కగా.

ఉ :- నేనే!

సు :- మీరే విడిచిపెట్టారా. మంచివాడుకాదా!

ఉ :- చాలామంచివారు.

సు :- చిత్రంగా ఉందే

ఉ :- మానవజీవితాన్ని తరచిచూస్తున్నకొద్దీ చిత్రవిచిత్రాలు బయటికి వస్తవి.

సు :- అలాగేఉంది. చూడ్డో స్తే మంచివారంటున్నారు. మీరు విడిచిపెట్టడ మేమిటండి ?

ఉ :- బుద్ధి గడ్డితిని.

సు :- ఏమిటో చెప్పాదురు చంపక-

ఉ :- (రాఘవరావు కేసిచూస్తూ) అయితే చెప్పేయమంటారా. మాఆయనకో పట్నంబదిలీ అయింది. అక్కడికి వెళ్ళినక్రొత్త రోజుల్లో మాకో ఆఫీసరుతో పరిచయమయింది. అతడు మాకెంతో సహాయం చేసాడు. ఆక్రొత్తల్లో-

రా :- (నిలబడలేక నీరసంగ కూర్చుంటాడు).

ఉ :- తర్వాత ఏంచెప్పను ?

సు :- చెప్పండి; చెప్పండి.

ఉ :- ముక్తసరిగా మూడుముక్కల్లో.

సు :- అలాగే-

ఉ :- ఆఫీసరు చెప్పినమాటలన్నీ, చేసినపనులన్నీ నిస్వార్థాలని భావించాను. భావించి మోసపోయాను.

సు :- మీకు తెలియదండి. మగాళ్ళమాటలనసలు నమ్మమని ఎవరన్నారండి (భర్తతో) ఏమండీ, మీరేచెప్పండి-

ఉ :- ఆసంగతి అప్పుడు తెలుస్తేనా (రాఘవరావు కేసిచూస్తూ) ఇప్పుడున్న అనుభవం అప్పుడేదండి! ఆతేనెపూసిన మాటలన్నీ నిజమేఅనుకున్నానండి- చేసికొన్న భార్య చనిపోయిందని

నాకు నమ్మకంపుట్టేటట్లు-

రా :- (తలవాల్చుకుంటాడు)

సు :- చేశాడు- దాంతో మోసపోయి-

ఉ :- ఆడది మోసపోతే ఏమవుతుందండి (సన్నగానవ్వుతుంది)

సు :- ఆ-

ఉ :-ఆఫీసరుకి అక్కడనుంచి బదిలీఅయింది.

సు :- అయితే-

ఉ :- కొన్నాళ్ళకి తాను టూర్ వెళ్తున్నానని అక్కడకు రమ్మనమని వ్రాశాడు- అతడు చూపినప్రేమ అంతా నిజమే అనుకొని- నన్ను మనసారా ఆదరిస్తారుకదా అనుకొని-

సు :- అతగాడికి పెళ్లాంఉండేమో అనేనా ఆలోచించారా.

రా :- (లేచి కిటికీదగ్గరకు వెళ్లుతాడు)

ఉ :-చెప్పానుగా- పెళ్లాంలేనట్లే నటించారు- నేనామాటెత్తితే సమాధానమీయకుండా- మాటల్లో మరపించేవారు.

సు :- అంతేనండి, మగవాళ్లు వరిర్ఘూటాకోరులు-

ఉ :- (రాఘవరావు కేసిచూస్తూ) అంతేనండి- తరువాత తెలిసి వచ్చిందండి.

సు :- తరువాత-

ఉ :- మాఆయనతో పుట్టింటికి వెళ్లివస్తానని చెప్పి, వెళ్ల వద్దన్నా దెబ్బలాడి.

సు :- వెళ్లారా?

ఉ :- అదేకదాఅండి ఇంతవరకు తెచ్చింది. ప్రేమించాను. మన

సారా- ప్రేమించాను అనగానే-

సు :- ఆడది నీరయిపోతుందండి- వెళ్లారూ- ఆ!

ఉ :- ఇంకేముందండి. రెండురోజులు కాలక్షేపంచేసి మళ్ళీ మాఆయనదగ్గరకు వెళ్లిపొమ్మనడానికి రమ్మన్నాడటండి.

సు :- హారినిర్భాగ్యుడు! (భర్తతో) చూచారా మీమగాళ్లు.

ఉ :- నాకెంతకోపం వచ్చిందనుకున్నారు.

సు :- నేనయితే కాలిచెప్పుతీసి ఈపెడా- ఆపెడా-

రా :- (ఉలికిపడుతాడు)

ఉ :- చేతులారా జీవితాన్ని నరకంలోకి త్రోసివేసికొన్నానండి. మళ్లీ మాఆయనదగ్గరకి ఏమొగంపెట్టుకొని వెళ్లనండి.

సు :- వెళ్లకపోయినారా- మీవారు చాలా మంచివారని అంటున్నారు. వెళ్లి కాళ్లమీదపడి చేసినతప్పును ఒప్పుకొని-

ఉ :- అదేలనుకొన్నా. కాని ఇంతలో ఈఉద్యోగం వచ్చింది.

సు :- ఆ ఆఫీసరు ఎవరండీ.

రా :- (ఉపకేసిచూస్తాడు)

ఉ :- (రాఘవరావు కేసిచూస్తూ) ఎవరా అండి ఎవరని చెప్పనండి- ఎందుకులెండి. అయిందేదోఅయింది. "చేసికొన్నంత మహాదేవా" అని అనుభవించక తప్పుతుందా! చూచారూ సుభద్రమ్మగారూ- మానవజీవితమే ఒకఅపశ్రుతి- ఉంటానండి. (చరచరా నిష్క్రమణ)

సు :- (భర్తతో) ఎవడోదుర్మార్గుడు- నమ్మకద్రోహమంటే ఇంతకన్నా ఉంటుందండి. పాపం. నిజమే జీవితమే అపశ్రుతి!

రా :- (తల తడుముకొని కుర్చీలో కూలబడి) అపశ్రుతి!

- తెర -

# వాగ్దానము

రచన 6 – 9 – 58

పాత్ర సూచి :-

శాంత ... నలుబదిఏళ్లుదాటిన వితంతు

మధు ... శాంతకొడుకు. పదిఏండ్లు

నారాయణ ... 20 ఏళ్లు. శాంతపనిమనిషికొడుకు

డాక్టరు. కేశవమూర్తి ... 35 ఏళ్లు. టకప్‌లో ఉంటాడు.

పోలీసుఇన్స్పెక్టరు ...

కానిస్టేబుల్సు ... ఇద్దరు

రంగము :- శాంతఇల్లు– ఒక గది, ఒక వంటవసారా మాత్రమే. గదిమాత్రమే ప్రేక్షకులకు కనిపిస్తుంది, గదిచూస్తే బాగా బ్రదికి చిదికిపోయిన సంసారుల సామానుతో ఉంటుంది. ఆగదికి ఎదురెదురుగా ద్వారాలు– అందులో ఒక ద్వారం వంటింటిలోనికిదారి. ప్రేక్షకులకు ఎదురుగాఉండే గోడకు ఒక పెద్దకిటికీ– దానికి ఊచలులేవు– గదిలోని వెలుతురుకీ గాలికీ అదేఆధారం. ఒక మంచం, గ్లాసు, మంచినీళ్ల చెంబుతో బల్ల– రెండు మడతకుర్చీలు– బట్టలదండెం– చిన్న బీరువా– పావుసగం పగిలిన అద్దం గోడకి– రెండు మూడు ఫోటోలు– ప్రాముఖ్యంగా గాంధీజీ చిత్రం ప్రేక్షకులకు కనిపించేలా గోడకు తగిలించబడి ఉంటవి. ఇలాంటి చిల్లరి సామానులతో ఉంటుంది. మంచానికి ఒక గజందూరంలో హరికేన్ లాంతరు వ్రేలాడుతుంటుంది.

**మధు** మంచంమీద పడుకొనిఉంటాడు. భుజాలవరకు దుప్పటితో కప్పబడిఉంటుంది. అతని మంచందగ్గర ఒక పొట్టి బల్ల, దానిమీద మందుసీసా. ఒక ఔన్సుగ్లాసు. (తెరలేచే టప్పటికి కొంచెం మసకగాఉండి నెమ్మదినెమ్మదిగా ఆగది కాంతివంతమవుతుంది.) సమయం రాత్రి 10 గంటలు.

మధు :– (తలఆడిస్తూ. కప్పిఉన్నదుప్పటిని తన్ని వేసుకుంటాడు)

శాంత :– (మంచందగ్గర నిలబడిఉంటుంది) ఏం నాయనా– (దుప్పటిని సరిచేస్తుంది)

మధు :– ఉ– ఊ (తలాడిస్తూ మూలుగుతాడు)

శాం :– (మంచంమీద కూర్చుండి నొసలుతాకి) జ్వరం తీవ్రంగా కాచిపోస్తుంది.

మ :– అమ్మా!

శాం :– ఏంనాయనా– మధూ

మ :– (మాటాడడు)

శాం :– (లేచి తలుపుదరికివెళ్లి తలుపుతీసి వీధిలోకిచూచి) ఇంకారాలె నారాయణ, డాక్టరేమన్నాడో (తలుపు దగ్గరకు వేసి మంచందగ్గరకు వస్తుంది)

మ :– అబ్బా!

శా :– (వంగి) ఏం మధూ– బాధగాఉందా

మ :– ఉ– ఊ!

శా :– ఎక్కడమ్మా ఎక్కడ– (శరీరం నిమురుతుంది)

మ :– అమ్మా–

శా :- ఆఁ- ఇక్కడే ఉన్నామఘూ, ఏంకావలి నాయనా ?

మ :- నాన్నే!

శా :- ఆఁ- ఆఁ- నాన్న!

మ :- (మాటాడడు)

శా :- (నిట్టూర్చి) వాళ్లనాన్నంటే ఎంతో మమత (లేస్తుంది)

(నారాయణ ప్రవేశం)

శా :- ఏఁరా నారాయణ- డాక్టరేమన్నాడు- వస్తున్నాడా-

నా :- (నిట్టూర్చి) ఎక్కడిడాక్టరండీ అమ్మగారు. ఎంత బ్రతిమాలినా వినిపించుకుంటేగా. అసలు నాకేసిచూస్తేగా.

శా :- బీదవాళ్లంటేనే అంత ఈసడింపురా- ఫలానివారి అబ్బాయిఅని చెప్పలేకపోయినావా ?

నా :- చెప్పానమ్మా- అన్నీచెప్పా- మాఅయ్యగారు పెద్ద ప్లీడరీచేసి చచ్చిపోయారని చెప్పా- మీరు వారి పేరువినే ఉంటారనికూడా చెప్పా- ఎన్నిచెప్పితే ఏఁ- ఫీజు తెచ్చావా అని అడిగాడు పక్కని ఆసామీ- మాబాబుని వచ్చిచూచి మందిస్తుంటే రేపుఎంతయిమ్మంటే అంతఇచ్చుకుంటామనిచెప్పా

శా :- ఎంతదయలేదురా- డాక్టరుతో స్వయంగా-

నా :- చెప్పకే- అదీఅయింది- డాక్టరు లోపల్నించివచ్చి బయటికి వెళ్లిపోతూ నన్నుచూచి వీడెవడు- అన్నాడు- ఎవడో మందుకు వచ్చాడు- మిమ్మల్ని వాళ్లింటికి రమ్మంటాడు- ఫీజు అడిగితే రేపిస్తాడట- అనిఇంకా ఆ ఆసామీ చెప్పతుండగానే- సరే- క్లబ్బుకి వేళయిందిఅని నేరుగా చక్కాపోయాడు.

శా :- మన దురదృష్టంరా

నా :- మీకేమండి-

శా :- ఏంరా

నా :- నాదండి దురదృష్టం

శా :- నీకేరా ?

నా :- తిరగలేక చస్తున్నా

శా :- (నిట్టూర్చి) అలాగేరాపాపం- కష్టపడుతున్నావు. ఇప్పుడెలాగరా- అబ్బాయినిచూడవస్తే మనలోలేడు- జ్వరం వంటిమీద పేలాల్ని పేల్చేస్తున్నది- పలవరింపు లెక్కువయ్యాయి- రాత్రిఅవుతుంది- నారాయణ! ఇంకెవరు డాక్టర్లు లేరా

నా :- ఎందుకు లేరండి- ఊరినిండా!

శా :- ఏంలాభం- వారిహృదయాలు కరడుగట్టాయిరా.

మ :- అమ్మా!

శా :- (మంచందరికివెళ్లి) ఏఁ నాయనా.

మ :- (తలాడిస్తూ కాళ్లుచేతులు కొట్టుకుంటాడు)

శా :- నారాయణా- నారాయణా- కాళ్లుపట్టుకోరా- మాబాబు కాళ్లుచేతులు ఎలాగకొట్టుకుంటున్నాడో (చేతులుపట్టుకొని) ఏంగతి- ఏంబాబూ- అలాకొట్టుకొంటున్నావేఁబాబూ

మ :- (మాటాడడు)

శా :- అయ్యో- మాటాడడు- ఎక్కడబాధో తెలియదు- ఏంబాధో తెలియదు ఒక్కగానిఒక్కడు- నారాయణా- ఇంకో

డాక్టర్నైవరినైనా సరే- వెళ్లిరా- ఉన్నా ఒకగాజులజతను తెగ నమ్మి వారికిచ్చుకుంటాను- తప్పకుండారమ్మను- వారికష్టం ఉంచుకోమనిచెప్పు- వెళ్లి రా- నారాయణా- త్వరగా.

నా :- (కాళ్లువిడిచి) అలాగేనమ్మా (వెళ్లుతుంటాడు)

శా :- చూడు నారాయణ! ఏఇంగ్లీషుడాక్టరు రాకపోయినా మన వీధిమొగను తెలుగువైద్యుడున్నాడు- శాస్త్రిగారో చయనులుగారో- ఎవరో- వారినైనా ఒకసారిరమ్మను.

నా :- ఇలాటి గడ్డుజబ్బులికె నాటువైద్యులేమిచేస్తారమ్మా-

శా :- అలాఅనకు- ఏవైద్యానికికావైద్యమే- వెళ్లిత్వరగా- ఇక్కడఉన్నట్టురా- దిగులుగాఉంది- ఇన్నాళ్లులేనిభయం నన్నావరిస్తున్నది- చాలా కష్టపడుతున్నావు పాపంమాకోసం నీఋణం-

నా :- (నిష్క్రమణ)

శా - (మధు దుప్పటిసరిచేసి ప్రక్కని కొంచెంసేపు మధుని దీక్షగాచూస్తూ కూర్చుని నిట్టూరుస్తూ లేస్తుంది- పరధ్యానంలో ప్రక్కకునడుస్తే బల్లతగిలి క్రిందపడపోయి ఆపుకొని) కర్మ- ఏపాపంచేశానో క్రిందటిజన్మలో (అని మంచానికి కొంచెందూరంగాఉన్న కుర్చీలో కూర్చుని నిట్టూరుస్తుంది. ఆమె కూర్చున్నకుర్చీ కిటికీకి ఎదురుగా ఉంటుంది. ఆకిటికీ గుండా కేశవమూర్తి ఎక్కివస్తుంటాడు)

శా :- (అతడు కిటికీలోంచి గదిలోనికి దిగబోయేముందు అతనినిచూచి కెవ్వునఅర్చి మళ్లా కుర్చీలో కూలబడిపోతుంది)

కే :- (లోపలికిదిగి)- పోలీస్- పోలీస్ (అని ముద్దగా చతికిల బడిపోతాడు- అతని కళ్లజోళ్లు క్రింద పడిపోతవి (జుట్టురేగి ఉంటుంది)

శా :- (తేరుకొని)- ఎవరు- అలాపడిపోయాడే (నెమ్మదిగా లేచి ముందుకు అడుగువేసి) ఎవరు- పలకరే (నెమ్మదినెమ్మదిగా అడుగులు వేసుకుంటూ అతనిదగ్గరకువెళ్లి) మాటాడరే- మాటాడ్డే- ఇలా ముద్దగా పడిపోయాడు- ఎవరో మర్యాద స్థుడి లాగేఉన్నాడు- ఈరోజుల్లో ప్రతి దొంగవెధవ టకప్ లోనే ఉంటున్నాడు- (బాగా వంగిచూచి లేచి) అదీసంగతి- బాగాత్రాగాడు- మత్తులోఉన్నాడు. ఎలావచ్చాడో ఇక్క- డికి- ఇంకోనిర్భాగ్యుడు (నిట్టూరుస్తుంది)

కే :- (కదలి లేవపోతూ)- పోలీస్, పోలీస్!

శా :- (కిటికీలోంచి తొంగిచూచి తలుపులు మూసివేసి) ఎవరుమీరు?

మ :- అమ్మా!

శా :- (వెంటనే మంచందరికివెళ్లి) మధూ- ఏం (నొసటిమీద చెయ్యివేస్తుంది)

మ :- (మాటాడడు)

శా :- (మళ్ళీ కేశవమూర్తి దరికివచ్చి) ఎవరుమీరు?

కే :- (మాటాడడు)

శా :- (మధుకేసి, కేశవమూర్తికేసి చూస్తూ)- "ఇద్దరూ మాటాడరు" అన్నట్లుగా విస్తుపోయి కేశవమూర్తిమీద

వంగి)- మీరెవరు- మాటాడరే.

కే :- (కదలి) నేనా- (అని లేచి గోడకి జేరగిలబడి కూర్చుని)

నేనా- ఆ- (తలవాలుస్తాడు)

శా :- ఆ- ఆ- చెప్పండి ఎవరో!

కే :_ నే-ను- నే- పోలీస్- పోలీస్-

శా :- పోలీసులిక్కడెవరూలేరు- మీరెవరో చెప్పండి?

కే :- చెప్పనా- చెప్పు- తా- నే- ను- పోలీస్ (తలవాల్చేస్తాడు)

శా :- (గ్లాసుతో నీళ్లు తెచ్చి ముఖంమీద జల్లుతుంది)

కే :- (కొంచెం తెప్పరిల్లి)- దాహం- హాం?

శా :- (మంచినీళ్లిస్తుంది)

కే :- (కొంచెం త్రాగి గ్లాసునుజారవిడిచిగోడకి జేరగిలిపోతాడు)

శా :- బాగావచ్చిపడిందే- ఎవడో- ఎవరండి మీరు (అని భుజంపట్టుకొని ఊపుతుంది)

కే :- ఆ- ఆ-

శా :- ఎవరుమీరు- చెప్పకపోతే- బయటకు వెళ్లిపొండి- ఊఁ

కే :- ఆ- వద్దు- చెప్పు- తా- నే- ను- పోలీసు- పోలీస్-

(ప్రవేశం నారాయణ తలుపు త్రోసికొని) పోలీస్- పోలీస్-

(తలుపు గడవేసి తలుపుకానుకొని నిలబడుతాడు)

కే :- పోలీస్- పోలీస్- (లేవబోయి ముందుకు పడతాడు)

నా :- (చూచి) మీరెవరు?

శా :- పోలీసులెక్కడ?

నా :- మన యింటిచుట్టూ- ప్రక్కవాటా రామారావుగారిల్లు

సోడాచేస్తున్నారు

శా :- ఎందుకు?

నా :- ఏమో- (విస్తుపోతూ) వీరెవరండీ?

శా :- అదే అడుగుతున్నా ఇందాకటనుండి.

నా :- ఎల్లావచ్చారు మరి?

శా :- కిటికీలోంచి.

నా :- (విస్తుపోతూ) కిటికీలోంచీ- అలాగ బోర్లాపడిపోయాడే మండి

శా :- వచ్చిచూడు.

నా :- (దగ్గరకువచ్చిచూచి) చిత్తుగా త్రాగేశాడు.

శా :- ఎవరో మర్యాదస్థుడిలానే ఉన్నాడు- ఆ- ఆ- కళ్లజోళ్లు తొక్కుతావు (అని తీసి బల్లమీద పెట్టుతుంది)

నా :- ఆ- ఆ- స్వారాజ్యం వచ్చాక- మహా- మహా- ఘరానా వాళ్లే తెగతాగేస్తున్నారండీ-

శా :- కొంచెం సాయంచేయి నారాయణ! కుర్చీమీద కూర్చోపెట్టుదాం- పాపం-

మ :- అమ్మా! అబ్బా!

శా :- (చట్టునవెనక్కితిరిగి) ఆ- బాబూ (మంచందరికి వెళ్లి నుదుట చేయివేసి)- ఏం బాబూ- ఇందాకటనుంచీ ఒక్కలాగేఉంది జ్వరం- ఏమన్నాడు డాక్టరు-

నా :- డాక్టరు-

శే :- ఆ- ఆ-

(ఇద్దరూ అతనికేసి చూస్తారు)

కే.- (లోలోన ఏదో గొణుగుకుంటాడు)

శా :- ఏమన్నాడు

నా :- ఏమంటాడు- పాతపాటే- మీరు చెప్పారే ఆ తెలుగు వైద్యుడిదగ్గరికి కూడా వెళ్లా!

శా :- అతఁడేమన్నాడు?

నా :- ఊళ్లోలేడు- ఏదో కేసుకి-

శా :- బాగావచ్చిపడిందే- ఇప్పుడేంచేయడం-ఒక్క-డాక్టరు-

కే :- ఆ- ఆ- పోలీసు-

నా :- (కళ్లు పెద్దవిచేసి) ఆ- ఆ- తెలిసింది- పోలీసులు

శా :- ఏం తెలిసిందిరా?

నా :- పోలీసులు ఇతగాణ్ణి పట్టుకోవడానికే అందరిళ్లు సోదా చేస్తున్నారండి.

శా :- నిజం-

నా :- అంతే అండి తప్పకుండా-

శా :- అయితే ఏదయినా దొంగతనం-

నా :- అయితే అదీఅవ్వొచ్చు కానండి_ త్రాగాడు కాదండి-

శా :- త్రాగితే-

నా :- మీకింకా తెలియదండీ- గవర్నమెంటోరు ఏదో పెట్టారు

శా :- అదా- ప్రొహిబిషన్-

నా :- అదే- అదే- ఆపేరు నాకు తెలీదులెండి.

శా :- తెలిసింది- తెలిసింది- ఈతొందరలో నామనస్సు పని

చేయడంలే- నిజమే- నీవుచెప్పింది-

నా :- ఇతడు త్రాగివస్తాంటే-

శా :- ప్రొహిబిషన్ పోలీసులుచూచి వెంటాడి ఉంటారు-

నా :- ఇతగాడు ఎలాగో తప్పించుకొని-

శా :- కిటికీలోంచిఎక్కి--

నా :- ఇక్కడ పడ్డాడు.

శా :- ఇప్పుడెలారా- మనమీదకి వస్తుందేమో-

నా :- మాయి టిపక్క సోమయ్య త్రాగి తందనాలాడుతూ ఇంటికివచ్చాడు- ఎలాపసిగట్టారో పోలీసులువచ్చి వాణ్ణి పట్టుకొని ఇల్లంతా సోదాచూచి లేస్తే తన్ను, కూర్చుంటే తన్ను, తన్ని మరీతీసుకుపోయారు ఠాణాకి.

శా :- మనఇంటికి వస్తారేమో

నా :- ప్రక్కిల్లు సోదాఅయిపోగానే మనఇంటికి-

శా :- ఎలారా ఇప్పుడు-

నా :- మనకేమండి- అప్పచెప్పేద్దాం- మాకానివాళ్ళండి పోలీసులు.

కే :- ఆ- ఆ-

శా :- సరేగాని- ముందితన్ని కుర్చీమీద కూర్చోపెట్టదాం. (అని వాళ్లిద్దరుకలసి కూర్చోపెట్టుతారు- గ్లాసుతో నీళ్లుతెచ్చి మొగంమీద జల్లుతూ) నారాయణా- మధ్య ఈగొడవ వచ్చి పడిందేరా- మాబాబు అలా జ్వరంలో పడిఉన్నాడు- ఏడాక్టరూ-

కే :- ఏ- ఏ- డాక్టరు-

శా :- ఎవరుమీారు- పోలీసులు వస్తున్నారు.

కే :- (కంగారుగా లేవబోతాడు)

నా :- (కూర్చోబెట్టుతాడు)

శా :- నారాయణా! ఆబల్లమీాద నిమ్మకాయఉంది కోసి నీళ్ళలోకలిపి తీసుకురా.

నా :- (అలా చేస్తుంటాడు)

శా :- (అతనికేసిచూాస్తూ)- ఎవరో చెప్పరే-

కే :- (మాటాడడు)

నా :- (నిమ్మరసం తెచ్చిఇస్తాడు)

శా :- ఇది త్రాగుతారా

కే :- త్రాగనా- త్రాగా-ఇంకా త్రాగుతా-త్రాగుతా.. ఏ-దీ

శా :- ఇదిగో (నోటికిస్తుంది)

కే :- (గడగడత్రాగి పెదవివిరుస్తాడు)

శా :. విసనకర్రతో విసర్రాకొంచెం నారాయణా!

నా :- (విసనకర్ర తెచ్చి విసరుతాడు) చిత్తుగాఉన్నవాడికి మంచి విరుగుడే- మీాకన్నీ తెలుసే

శా :- నాకలవాటేగా (నిట్టూారుస్తుంది)

నా :- ఆ- ఆ- మాఅమ్మచెప్పింది- తెలుసు- తెలుసు.

శా :- కొంచెం కొంచెం తేరుకుంటున్నాడు చూడరా?

మ :- అబ్బా? అమ్మా!

శా :- (చటాలున మంచందరికివెళ్లి ప్రక్కనుకూర్చుని తల

నిమురుతూ) నారాయణా- డాక్టరు-

కే :- ఆ- ఆ- వస్తూన్నా (లేవబోతాడు)

నా :- (పట్టుకొని కూర్చోపెట్టి) కొంచెం కొంచెం-అమ్మగారు-

శా :- (లేచివచ్చి) తేరుకుంటున్నాడా అయితే నీవువెళ్ళి ఏడాక్టరు-

కే :- (కళ్లు తెరచి దిక్కులుచూస్తూ) ఆ- ఆ- ఏ-

శా :- ఎవరుమీారు?

కే :- నే- నే- నా (రేగినజుట్టు సరుదుకుంటాడు)

శా :- తెలివి వచ్చిందా-

కే :- ఎ- వ- రి- కీ-

శా :- మీా కే!

కే :- నా- కూ- ఏఁ

శా :- ఇదంతా ఏమిటి-

కే :- (నొసటమీాద గీస్తాడు)

శా :- కర్మ!

కే :- ఆ- ఆ

శా :- కర్మ! ఏంవచ్చింది కర్మకి- త్రాగి- త్రాగి- చేతులారా నిండుసంసారాన్ని బుగ్గిచేసుకోవడం!

కే :- (ఆమెకేసి చూస్తుంటాడు మాటాడడు.తలుపుచప్పుడు)

కే :- పోలీస్- పోలీస్ (లేవబోతాడు)

శా :- కూర్చోండి- మీాసంగతంతా అర్థమయిందినాకు.

కే :- పోలీస్- పోలీస్-

శా :- పోలీసులికి అప్పచెప్పివేస్తా-

కే :- ఆ- అమ్మో- అ- నమస్కారం (చేతులుజోడిస్తాడు)

శా :- మన క్షేమంకోరి మనప్రభుత్వం మద్యపాననిషేధాన్ని అమలుపరిస్తే- మీలాంటివాళ్ళందరూ పోగయి దాన్ని సక్రమంగా జరగడానికి ద్రోహదంచేయక- మీరేదానికి దాసులయి-మద్యపాన నిషేధానికి అవరోధాలుకల్పిస్తున్నారు. ప్రభుత్వం ఎంతప్రయత్నిస్తే- ఏంలాభం, ప్రజాసహకారం లేందే- ఏమంటారు?

కే :- నమస్కారం- (చేతులు జోడించేఉంటవి)

శా :- ఎందుకు నమస్కారాలు- పోలీసులికి అప్పచెప్పేస్తా-

కే :- ఆ- ఆ- వద్దు- వద్దు-

శా :- మీలాంటి త్రాగుబోతుల్ని పట్టి అప్పచెప్పకపోతే ప్రభుత్వానికి ద్రోహంచేసిన దాన్నవుతాను- నాధర్మం-

కే :- నాగౌరవం-

శా :- త్రాగేటప్పుడు- ఈగౌరవం- ఈప్రతిష్ఠ- (తలుపు చప్పుడు) నారాయణా వెళ్ళితలుపుతీయరా-

నా :- (తలుపు తీయడానికి వెళ్లుతుంటాడు)

కే :- వద్దు- వద్దు- నాపరువు- మీచేతిలో- అమ్మో!

శా :- నారాయణా!

నా :- (ఆగిపోతాడు. తలుపుచప్పుడు)

శా :- ఇలారా- వీర్ని తీసుకువెళ్లి వంటింటిలో కూర్చోపెట్టు- నీవుకూడ అక్కడేఉండు- తలుపు లోపలవేసికో. ఎంతకొట్టినా

తీయకు, త్వరగా (తలుపుచప్పుడు) త్వరగా- వచ్చే-
(నారాయణ, కేశవమూర్తి వంటింటిలోనికి వెళ్ళి తలుపు వేసి
కొంటారు. తలుపుచప్పుడు)

శా :- వచ్చే- వచ్చే- ఎవరు.

ఇ :-(లోనుండి) ఇందాకటనుంచి తట్టుతుంటే తెరవరే-ఎవరు
లోపల

శా :- నెమ్మది- వస్తున్నా- (తలుపుతీసి ఒక్క-అడుగు వెనక్కి-
వచ్చి నిలబడుతుంది గుమ్మానికడ్డంగా- ఇనస్పెక్టరు గదిలోకి
వచ్చి ఆమెముందు నిలబడుతాడు- అతని వెనుకతలుపు దగ్గర
ఇద్దరు పోలీసులు)

ఇ :- (ఇల్లంతా కలయచూస్తాడు)

శా :- (ఒక్క- అడుగు వెనక్కు- వేసి) ఎందుకండి ?

ఇ :- మీాయిల్లు సోదా చేయాలి.

శా :- మాకిల్లెక్క-డిదండి- ఉన్నదంతా ఈ ఒక్క-గదే!

ఇ :- అదే సోదా చేస్తామ్.

శా :- ఎందుకో తెలుసుకోవచ్చా ?

ఇ :- మీాకనవసరం.

శా :- అనవసరమే అనుకోండి మాయిల్లుగదండి సోదా చేస్తా
నంటుంటా.

ఇ :- కారణాలు చెప్పాలిసిన అవసరంలేదు.

శా :- అయితే సోదాయేనా అవసరం,

ఇ :- హుఁ మగవారు లేరా ?

శా :- ఉంటే మీరీచాయలకు రాగలిగేవారా-

ఇ :- ఎక్కడికి వెళ్లారు.

శా :- ఎక్కడికి వెళ్లారనిచెప్పను- (కన్నులద్దుకుంటూ) భూమి మీద గుప్పెడు గింజలు కరువయ్యాక మీరు మేముఅందరం ఎక్కడికి వెళ్లుతామో అక్కడికే-

ఇ :- అలాగా-

శా :- నెమ్మదిగా మాట్లాడండి- మా ఎనిమిదేళ్ల కుర్రాడు- ఒక్కగాని ఒక్కకొడుకు- అడుగో చూచారా- విషజ్వరంతో బాధపడుతున్నాడు.

మ :- అబ్బా- నాన్నే- అయ్యో (తలాడిస్తూ కొట్టుకుంటాడు)

శా :- చూచారా- (దరికి వెళ్లి) ఏంనాయనా- మధూ ?

ఇ :- (బూటు చప్పుడు చేసుకుంటూ ముందుకువస్తాడు)

శా :- చూడండి- మీకు పుణ్యముంటుంది- చదువుకున్నారే మీరు- వచ్చేప్రాణం- పోయేప్రాణంతో ఉన్నాడు కుర్రాడు- మీ నా బూట్లు-

ఇ :- బూట్లు- పోలీసుబూట్లమ్మా అవి- చప్పుడు చేయడానికే-

శా :- ఆచప్పుడుతో అమాయకుల గుండెల్ని అదలించడానికి,

ఇ :- కాదు- కాదు- అపరాధుల గుండెల్ని-

శా :- అవును- అపరాధుల గుండెల్నే- చూడండి ఇన్స్పెక్టరు గారూ- ఈఊళ్లో పబ్లిక్ ప్రాసిక్యూటరుగా పనిచేసారు.

ఇ :- ఏడ్వొకేట్ శ్రీనివాసంగారా?

శా :- వీరికిముందువారు.

ఇ :- బారిష్టరు రామేశంగారు.

శా :- ఆ- ఆ- వారినెరుగుదురా.

ఇ :- క్రిమినల్లో అంతచేయిలేదు- వారు చనిపోయారుగా- అయినా ఇప్పుడాగోడవెందుకండి- మేం మాడ్యూటీచేసుకొని వెళ్లిపోతాం- ఏయ్ 1212- (1 పోలీస్ ముందుకువచ్చి) సార్!

శా :- ఈఇల్లు వారిదేఅని చెప్పుదామని.

ఇ :- ఆ- ఆ- వారిల్లిదా- ఆమేడలు-

శా :- ఆమేడలు- ఆమిద్దెలు- ఆతోటలు- ఆదొడ్లు- వారితోటే హారతికర్పూరంలా అంతరించాయి- అదివిడిచిన వాసనలా మేంమిగిలాం.

ఇ :- నిజం!

శా :- నిజంగాక- మాఅదృష్టరేఖ వక్రించింది_ ఆ ఆ స్తిఅంతా అప్పులవాళ్ల పాలయింది- ఈ ఉన్న ఒక్కగది అద్దెది.

పోలీ - పాపం.

శా :- భగవల్లీల అండి.

మ :- అబ్బా- అమ్మా- ఎవరో- వచ్చారు- వెళ్ళండి- నేను రాను- రానంటే- అమ్మా- రానే-

శా :- మధూ- ఎవరూలేరు నాయనా- చూచారా ఇనస్పెక్టరు గారూ- బారిష్టరుగారి ఒక్కగాని ఒక్కకొడుకు- తీవ్రజ్వరంతో మ్రగ్గుతున్నాడు- ఆయనుంటే అరగంట అరగంటకు ఒక్కొక్క డాక్టరువచ్చి చూచివెళ్లేవారు- ఇప్పుడు- ఎంతమంది డాక్ట ర్లని రమ్మని ప్రార్థించినా- ఒక్కడాక్టరు ఫీజు ఝుంఢ్లీయ్య

కుండా గుమ్మం తొక్కనంటున్నాడు- ఫీజు ఈయడానికి నాదగ్గర ఎర్రని ఏగానిలేదు. తెల్లవారేదాకా ఎలాగడుస్తుందో-ఏమో-నా బ్రతుకు-ఒక్కగానిఒక్కకొడుకు-అయ్యో!

(మంచంపట్టిమీద చతికిలబడి) అయ్యో పీణ్ణిచూచుకొనే-

ఇ :- అమ్మా విచారించకండి- కష్టాలు మనిషికిరాక మానుకి వస్తవా- మాడ్యూటీ మేంచేసుకొని మేంపోతాం.

శా :- చేసుకోండి.

ఇ :- ఏయ్ 1212, 106.

1, 2 పోలీ :-సార్ (అని ఒక్కసారంటారు)

1పో :-సార్ ఒక్కగ దేగదండి- అన్నీ మనకిక్కడినుంచే కనిపిస్తున్నవి- పాపం- ఆఅబ్బాయికి వచ్చేప్రాణం పోయేప్రాణం- మన అలజడికి.

శా :- (లేచి) బిడ్డలగన్న తండ్రివి, నాయనా- చల్లగా నూరేళ్లు వర్ధిల్లు.

ఇ :- అయితే ఇక్కడ లేడంటావా.

2పో :- కనిపిస్తున్నదిగా సార్- ఆబల్ల- ఆమంచం- ఆపెట్టి-

ఇ :- అయితే ఎక్కడ ఉన్నట్లు.

1పో :- అదే తెలిసికోవాలి సార్.

ఇ :- ఆకిటికీ మూసేవుందమ్మా ఇందాకటినుంచి.

శా :- బాబుకి గాలి తగులుతుందేమోఅని సాయంకాలం 6 గంటలకే.

ఇ :- అయితే మనంవచ్చి తలుపు కొట్టేముందు లోనుంచి

మాటలు వినిపించాయి.

మ :- అబ్బా- ఉష్- అమ్మా- నాన్నే- అదిగో- అయ్యో!

శా :- మాబాబు కలవరింపులే విని ఉంటారు- ఇనస్పెక్టరుగారు!

1పో :- అంతేనండి.

2పో :- నిజమేనండి.

ఇ :- (చుట్టూ కలయచూచి) ఆప్రక్కని- తలుపు- ఆగది-

శా :- అదాఅండి- అది మావాటాలోది కాదండి.

ఇ :- ఎవరిది మరి.

శా :- మాప్రక్కనున్న రామారావుగారి వాటాలోది.

1పో :- వారిల్లు సోదాచేసాంగా సార్ ఇప్పుడే.

2పో :- అక్కడినుంచేకదా అండి వచ్చాం.

1పో :- వెదకలేక చచ్చాం.

ఇ :- సరే. అయితే - వెళ్లివస్తామమ్మా. ఏమనుకోకండి. మాడ్యూటీ నిర్వహణలో దయాదాక్షిణ్యాలు దూరం- 106, 1212.

2పో :- సార్!

ఇ :- పదండి- అంతటి శాస్త్రిగారి సంసారమే ఇలాఅయితే

శా :- (తలుపుదగ్గరకు వారివెనుకవచ్చి) అలాఅనకునాయనా- ఎవరికెలా వ్రాసిపెట్టాడో దేవుడు ఎవరు చెప్పగలరు- నమస్కారమండి.

ఇ :- నమస్కారమండి- సెలవు.

శా :- సెలవు.

(పోలీసులు నిష్క్రమణ- శాంత తలుపులు దగ్గరకు వేసి గడియవేసి నిట్టూరుస్తుంది. వంటగది తలుపులు త్రోసుకొని నారాయణ ప్రవేశిస్తాడు- తరువాత కేశవమూర్తి అటూ ఇటూ చూస్తూ ప్రవేశిస్తాడు)

నా :- బలేగా పంపించేశారండి!

శా .- ఉష్ (ముందుకువచ్చి) ఇంకా ఏప్రక్కనైనా నక్కి ఉండవచ్చు- పోలీసులు నక్కజిత్తులాళ్లు- వాళ్లకి పెళ్ళాంలేదు పిల్లలూలేరు- అని మాఆయన అంటూఉండేవారు.

కే :- పరువుప్రతిష్ఠల్ని సిలిపారు (అని కాళ్ళమీద పడతాడు)

శా :- ఆ- ఆ- (లేవదీసి) ఇంకా నిషా తగ్గలే.

కే :- తగ్గిపోయింది పూర్తిగా మీదయవల్ల.

శా :- అయితే ఏంపనిది-అలాకూర్చోండి. (కుర్చీచూపిస్తుంది)

కే :- ఇప్పటికే ఆలశ్యమైపోయింది. నాజీవితాంతం మీకు కృతజ్ఞుణ్ణి- మీకు చాలా ఋణపడ్డా- వెళ్లివస్తా.

శా :- మీరెవరో చెప్పకుండా.

కే :- వెళ్లిపోవడము భావ్యమా అంటారా.

మ :- అబ్బా- అమ్మా- నాన్నో- నాన్న (తల కాళ్లు కొట్టు కుంటాడు)

శా :- (చటాలున మంచందగ్గరకువెళ్ళి) ఏం నాయనా, ఏం- ఈగొడవలో పడిపోయా ఇందాకటినుండి- ఇదెక్కడి పాడు రోగమో మాటిమాటికి ఇలా కిలారిల్లిపోతున్నాడు.

కే :- (ఆమె వెంట మంచందగ్గరకువెళ్ళి) ఏమండి అబ్బాయికి

శా :- ఏమని చెప్పను- రెండు రోజులనుండి తీవ్రజ్వరం- ఇవ్వాళ సాయంకాలంనుండి పేల్చివేస్తున్నది. మాటమాటకి పలవరింతలు- తల కాళ్లు తెగకొట్టుకుంటాడు.

కే :- ఏడాక్టరిస్తున్నాడు మందు.

శా :- డబ్బున్నవాళ్ళకి డాక్టర్లుగాని మాలాంటి దరిద్రులకి ఎలావస్తారు నాయనా డాక్టర్లు!

కే :- అలాఅనకండి- మీకేం లక్ష్మీసంపన్నులు- ఏదో దుర దృష్టవశాత్తు.

శా :- అదంతా గడిచిపోయింది,

కే :- ఏడాక్టరుకోసమైనా- (అని వంగి గుండెలు, కళ్ళు, నాలుక చూస్తాడు.)

నా :- కాళ్ళు అరిగిపోయాయంటే నమ్మండి- ఒకడాక్టరూ-

శా :- రాందే- ఈఊరిలో ఒక్కడాక్టరికీ దయాదాక్షిణ్యాలు ఏకోశానా లేందే- డబ్బుతో వ్యాపారంగాని మనుష్యులతో వ్యాపారమా డాక్టర్లకి- రోగిని వచ్చి చూడడానికిముందే ఫీజు- మాటాడితే ఫీజు- ప్రస్తుతం మాదగ్గర లేదు - బాబు వచ్చేప్రాణం పోయేప్రాణంతో మంచంమీద పడిఉన్నాడు- వచ్చిచూచి మందీయండి తెల్లవారగానే ఏతలో తాకట్టుపెట్టి డబ్బుతెచ్చి ఇస్తాం- రండిబాబు అని బ్రతిమాలితే,

నా :- వినిపించుకోకపోయినా బాగుండేది- పైగా ఆసికాలు.

కే :- డాక్టరు కేశవమూర్తి యింటికి పంపారా.

శా :- ఆ- పంపాను- అతడు మంచివాడని- దయాశాలి అని

అందరంటారు.. అందుకే పంపాను.

కే :- మంచివాడు! పంపితే!!

నా :- కాంపౌండరుబాబు ఫీజు తెచ్చారా అన్నాడు- "లేదు" అన్నాను- "వెళ్ళితే" అన్నాడు- డాక్టరుగారితో చెప్పు దామని అక్కడే నిలబడ్డాను- ఆయన సూటు బూటు వేసు కొని చరచరావచ్చి నాకేసిచూస్తూనే- నేనుచెప్పేది వినిపించు కోకుండానే.

కే :- వెళ్ళిపోయాడు- ఏం (నిట్టూర్చి) నారాయణా- కేశవ మూర్తిగారిల్లు ఎరుగుదువన్నమాటేగా.

నా :- ఆ- బస్ స్టేండు దగ్గర.

కే :- ఆ- అక్కడకేవెళ్ళి.

నా :- వెళ్ళి.

కే :- కాంపౌండరునులేపి (శాంతతో) చూడండి ఏదైనా తెల్లకాగితం ఇయ్యండి.

శా :- (కాగితంఇస్తూ అతన్ని తేరిపారచూస్తూ) మీ కళ్ళు జోళ్ళివిగో.

కే :- ఇవీజాగ్రత్తపెట్టారు- దొడ్డవారు- ఎక్కడో వచ్చే దారిలో (అవితీసికొని పెట్టుకొని ఏదో వ్రాసి) నారాయణా ఈచీటి ఆయనకు చూపించు వేగిరం.

నా :- (పుచ్చుకొని) ఏమయినా చెప్పాలాఅండి.

కే :- అక్కరలే- చూపించు- అంతే- నీవువచ్చేదాకా ఇక్కడే ఉంటా.

శా :- (చేతిగాజులు తీసి) నారాయణా! వారికీగాజులీయి, కావలిస్తే రేపు అమ్మి డబ్బిచ్చుకుంటామనిచెప్పు- ఎలాగో తప్పకుండారమ్మను.

కే :- వద్దు- వద్దమ్మా- ఇవ్వకండి!

శా :- మీకు తెలీదండి- డబ్బిస్తేనేగాని డాక్టరు-

కే :- నేనుచెప్తాగా- నారాయణా! వెళ్ళి త్వరగారా.

నా :- ఇదిగో చిటికిలో (నిష్క్రమణ)

కే :- అమ్మా- మీరలా కూర్చోండి. మీ అబ్బాయి ఇంత తీవ్రజ్వరంలో ఉన్నాకూడా నాకోసం కష్టపడ్డారు-మిమ్మల్ని ప్రాణరక్షకులనడం కంటె మానరక్షకులంటేనే సమంజసం. ఎందుకంటే ప్రాణంకంటె మానం విశేషంగనుక నా విష యంలో-ఇవ్వాళగనక నన్ను పోలీసులు పట్టుకొని ఉంటే నాజీవితం అధఃపాతాళలోకంలోనికి దించుకొని పోయేది- నా గౌరవం నా ప్రతిష్ఠ మన్నులోకలసి ధ్వంసం అయ్యేది.

శా :- గతించినదాన్ని త్రవ్వడమెందుకండి.

కే :- అది సజ్జనుల లక్షణం.

శా :- (నవ్వుతూ) అన్నీ తెలిసి ఉండి-

కే :- త్రాగానంటారా- తెలుసు-త్రాగడం తప్పని తెలుసు- తెలిసే చేస్తున్నానండి-ఏమిచేయనండి?

మధు :- అబ్బా—నాన్నే — నిన్ను —నిన్ను—

శా :- బాబు—అయ్యో—ఏమండీ—

కే :- (నాడిచూచి) ఏం భయపడకండి నేనున్నానుగా—

శా :- మీరెవరు ? (అతనికేసి చూస్తుంది)

కే :- నేనా—నేను—కేశవమూర్తిని—

శా :- డాక్టరు కేశవమూర్తి—

కే :- ఆ— కేశవమూర్తిని నేను బాగా ఎరుగుదునండి—నామాట తీసివేయరండి—

మధు :- అబ్బా- నాన్నా-నాన్న- కొట్టకు-కొట్టకు- ఎందుకు కొట్టడం-అయ్యో-అమ్మ ఏడుస్తుంది-కొట్టకు- రోజూఇలాగే నాన్నా! ఎందుకు- కొట్టుతావు-కొట్టకు నాన్నా! అయ్యో!

శా :- మధూ! మధూ! ఏమండీ- ఇలా కలవరింత లెక్కువయ్యాయి-ఎలా-

కే :- (అతని నాడిచూస్తూ) భయంలేదండి- మీరు భయపడకండి—అలా కూర్చోండి- నారాయణ వెళ్ళాడుగా.

శా :- (నిట్టూర్చి) విన్నారా-ఆ-పలవరింతలు !

కే :- ఆ—

శా :- అది నా గత చరిత్ర-

కే :- మీ గతచరిత్రా—

శా :- శోచనీయంగా ఉందా.

కే :- మీరు బారిష్టరు రామేశంగారి భార్యగారన్నారు-

శా :- నారాయణా-

కే :- ఆఁ—

శా :- ఇంకేమన్నా తెలుసా?

కే :- అంతే-కాని అంతటివారిలాంటి దుర్దశకు-

శా :- కారణమా?

కే :- ఆయన పబ్లిక్ ప్రాసిక్యూటరుగా పనిచేసి చాలా ధన మార్జించారని-

శా :- ప్రతీతి- సద్గుణవంతులని ప్రతీతి.

కే :- ఆ- ఆ!

శా :- ధనం సంపాదించడం మాట నిజమే- ఆ మేడలు- ఆ తోటలు- ఆ దొడ్లు-ఆయన బ్రదికున్నదా కా.. ఆయన దగ్గరకు రావడానికే ధైర్యంచాలలే దెవరికి-అలాపోయారు- ఇలా అప్పులవాళ్ళువచ్చి చీపురుపుల్లయినా మిగల్చకుండా-

కే :- అన్ని అప్పులా?

శా :- ఆ-హరిశ్చంద్రుడులా కట్టుకున్న భార్యను మాత్రం అమ్మలే-అంతే!

కే :- అంత జీతం-అంత సంపాదన-

శా :- హారతికర్పూరంలా హరాయించుకొని పోయింది.

కే :- కారణం.

శా :- కారణం- కారణం- త్రాగుడు.

కే :- (లేచి) ఆ- త్రాగుడు.

శా :- ఏమనుకున్నారు- త్రాగుడు-

కే :- ఆయన త్రాగుతారంటే-

శా :- ఎవ్వరు నమ్మరు- ముందు ఆయన కలవాటులేదు- నేనే నేర్పి నిత్యకల్యాణం పచ్చతోరణంలాగాఉండే సంసారాన్ని సర్వనాశనం చేసికొన్నా చేతులార.

కే :- మీరు- మీరు- నేర్పారా!

శా :- ఆ-

కే :- నమ్మడం.

శా :- కష్టంగానేఉంటుంది- నేను చెప్పిందివింటే ఆయనకు చాల జబ్బుచేసింది- తేరుకోవడం కష్టమని పెద్దపెద్ద డాక్టర్లు పెదవి విరచేశారు. ఒక ధన్వంతరివచ్చి వైద్యం ప్రారంభించాడు- నా మంగళసూత్రం బలిమివల్ల నెమ్మదినెమ్మదిగా ఆయన తేరుకున్నారు- కాని అమిత నీరసం- ఆనీరసం తగ్గాలంటే ఒక్కొక్క తులంచొప్పున రాత్రుళ్లు త్రాగమన్నారు బ్రాంది- ముందు ఆయన "ఛీ" పుచ్చుకోనన్నారు. బలవంతంచేయగా చేయగా పుచ్చుకోవడం ప్రారంభించారు-కొన్నాళ్లకు ఆయన తేరుకున్నారు- ఇంక మానివేయండి అన్నాను- ఆయన వినలేదు- బలవంతంచేశాను- వినలేదు- ప్రాధేయపడ్డాను- వినలేదు- ఏడ్చాను- వినలేదు- ఒక తులం- రెండు తులాలు- ఒక ఔన్సు- రెండు ఔన్సులు- ఒక గ్లాసు- రెండు గ్లాసులు- ఇలా నానాటికి పెచ్చుపెరిగిపోయింది- రోజూ మత్తుగాత్రాగి క్లబ్బునుంచివచ్చి కదలకుండా పడుకునేవారు- ఆఘట్టం గడి చింది కొన్నాళ్లు- తరువాత క్లబ్బునుంచి రావడం- ఏదో సాకుపెట్టి తిట్టడం కొట్టడం- ఇదీతంతు- అదే మాఅబ్బాయి జ్వరంలో కలవరింత.

కే :- అబ్బా!

శా :- ఆ త్రాగుడిలో- ఆయనఒళ్లు గుల్లయింది- బ్రతుకు

భగ్నమయింది- అప్పులు- అప్పులు- ఎటుచూచినా అప్పులు- అప్పులతో ఆయన సంపాదనంతా సర్వనాశనమయింది- ఆయన సంసారం నిలువనీడలేక- కట్టగుడ్డలేక- కన్నకొడుక్కి- జబ్బుచేస్తే డాక్టర్ని పిల్చి మందిప్పించుకొనే దిక్కులేక-

కే :- ఇంక చెప్పకండి (నిట్టూరుస్తాడు)

శా :- నేను చెప్పడమయిపోయింది- కాని-

కే :- కాని-

శా :- మీరు- మీరెవరో నాకు తెలియదు. కాని అకస్మాత్తుగా- ఆకాశం మీదనుంచి ఊడిపడ్డారు- చూడడానికి పెద్ద మనుష్యుల్లాఉన్నారు, మీరు- మీరు ఈ భీకర మద్యపిశాచానికి తలొగ్గి దాసులవ్వడం.

కే :- మంచిదికాదమ్మా- మంచిదికాదు- నాకు తెలుసు- దాని గుణగణాలు నాకు తెలియదంటారా- తెలుసు- ఎంత చేసినా డాక్టర్ని.

శా :- ఆ- మీరు డాక్టర్లా-

కే :- ఆ- మీఅబ్బాయికి జబ్బుగాఉంది రమ్మంటే వినిపించుకోకుండా రావాలని ఉద్దేశంఉన్నా లోపల- క్లబ్బుకివెళ్లి పెగ్ మీదపెగ్ వేసికోవాలనే ఉద్దేశంతో నవ్వుతూ తుర్రున కారెక్కాడే- లోకంలో మంచివాడు- దయాశాలి అని- లోకులను కన్నుగప్పి పేరుమోశాడే- ఆడాక్టరు కేశవమూర్తి-

శా :- ఆ- డాక్టరు కేశవమూర్తిగారా!

కే :- ఆ- ఆకేశవమూర్తి వీడే,

శా:- అంతగొప్ప డాక్టరని పేరుమోసి-

కే:- పేరు మోసి- త్రాగడంలో ఇంత గొప్పవాడు లేడని పేరుమోసి- మీరుకనుక ఆదుకోకపోతే ఈవేళ- ఆపేరు మోయడం బయటకుపొక్కి- దిక్కు-దిక్కులా వ్యాపించి- నాపేరుప్రతిష్ఠలు- అమ్మా- నాజీవితం (కుర్చీలోకూలబడతాడు)

శా :- (దరికివెళ్లి) శాంతించునాయనా. అందరిజీవితాలు.

కే :- ఒక్కలాఉండవు- నాజీవితాన్ని నేనే చేసేత పాడు చేసుకున్నానమ్మా- తలచుకుంటే నాహృదయం బ్రద్దలవు తుంది- మీలాంటి సౌహృదయులదగ్గర హృదయం విప్పి చెప్పితే ఆత్మశాంతి- (లేచి) నేనెందుకుత్రాగా- త్రాగడం దారుణం అని తెలిసికూడా ఎందుకలవాటుచేసికొన్నా-

శా :- ఎందుకు నాయనా- ఎ౦దుకు.

కే :- ఎందుకా- నా హృదయమర్మాల్ని అంటి నులివెట్టి బాపాడించే ఈ నారకబాధని మరచిపోయేందుకు- నాహృద యంతో నాకు సంబంధంలేకుండా చేసికొనేందుకు- అమ్మా- త్రాగాను- పదేపదే త్రాగాను- పగలంతా హాస్పటలులో పని- రాత్రిళ్లు క్లబ్బులో త్రాగడం- తెగత్రాగడం- మత్తెక్కి పడిపోవడం- ఏమాత్రంమానినా- భయంకర విషాదస్మృతి- మర్మాంతికబాధ.

శా :- నిక్షేపంలా డాక్టరువి- ఎందుకంతబాధ.

కే :- డాక్టర్లకి హృదయబాధకి సంబంధం లేదంటారమ్మా- నాజీవితంలో కనీ వినిఎరుగని విషమసంఘటన జరిగిపోయింది-

నేను మెడికల్ కాలేజీలో చదువుతున్నాను- లలిత నాక్లాసు మేటు- ఆమె చాలా తెలివైంది- చురుకైంది- అందుకుతోడు అందమైంది- పోనుపోను మాకు స్నేహం కలిసింది- ఒకరి నొకరం వలచికొన్నాము- వలపించుకొన్నాము- అదంతా ఒక ప్రణయగీతం- మాయిద్దరిది ఒక కులంకాదని మాతలిదండ్రు లెంత పోరినా వినిపించుకోలే- పెద్దల నీసడించే మనఃప్రవృత్తి కాదు- అయినా ఏంచేయను-- లలితను మనసారా ప్రేమిం చాను- అది నాభావిజీవితానికి సంబంధించింది- నా మనః ప్రవృత్తిని గెలిచి మాచుట్టాలికి దూరమై వివాహం చేసి కొన్నాం, ఏడుకొండలవాడి సాక్షిగా- నాచదువు పూర్తి అయింది- మాఆవిడదీ అయింది- నేను ప్రేక్టీసు పెట్టిన వేళా విశేషంవల్లనో, నాభార్యసహచర్యంవల్లనో, నాదాబడి అధిక మయింది- పట్టిన కేసల్లా ఫలించేది- నాది అమృతహస్తంఅని-

శా :- అవును మావారుకూడా అలాగే అనేవారు.

కే :- అన్నారు- అందరూ అన్నారు- కాని నాపట్లమాత్రం విషహస్తమైందమ్మా!

శా :- ఏమయింది నాయనా!

కే :- ఏమయిందా- ఏంచెప్పను- నాజీవితసుఖ స్వప్నం హఠాద్భగ్నమయింది- నాలలిత నవమాసాలుమోసి మొగ పిల్లాణ్ణి కన్నది. కన్నరోజున బాగానే ఉన్నది- కాని- కాని- ఎక్కడనుంచి ముంచుకువచ్చిందో ఆజబ్బు-ఎన్నో పుస్తకాలు తిరగవేశాను- అనుభవంగల డాక్టర్లతో సంప్రతించాను-

ఎన్నెన్నో క్రొత్తక్రొత్త మందులు వాడాను- కాని ఫలితం- నాలలిత నన్నువిడిచి- ఆపసికందును ఆమె జీవిత స్మృతి చిహ్నంగా విడిచి- ఈవిషాద జీవితస్మృతులతో క్షణంక్షణం సెత్తురురాని నిశిత బాధలతో కుమ్మిలి క్రుంగిపొమ్మని- నన్ను విడిచి వెళ్లిపోయిందమ్మా- (తల పట్టుకొని కుర్చీలో కూలబడతాడు)

శా :- ఇంత చిన్నతనంలో ఎంత విషాదసంఘటన- నాయనా- గతచరిత్ర స్మరింపచేశాను- పాపిష్టిదాన్ని-

కే :- మీరా- కాదు- కాదు- అమ్మా! నేను- ఈపాడు లోకాన్ని విడిచి వెళ్లలేక అడుగడుక్కీ- అవయింపచేస్తున్నా ఆంతరిక బాధలతో బ్రతికిఉన్న నేను పాపిష్టివాణ్ణి.

శా :- ఊరుకో నాయనా!

కే :- ఊరుకోక ఏంచేసేది అమ్మా- ఆవిషాద వేదనల్ని భరించ లేక కన్నుమూసినా తెరచినా యెదుట ప్రత్యక్షమయ్యే ఆ రూపాన్ని మరచిపోలేక; అనుక్షణం ఆకళింపుకువచ్చి అవయింప చేసే అమితానుభూతిని అరికట్టలేక; నెమ్మది నెమ్మదిగా అల వాటు చేసికొన్నాను- ఏదో క్షణిక శాంతి- అంతే- ఆ అలవాటు పరిపాటై చివరికి ఆత్రాగుడికి దాసుణ్ణయ్యాను- మీరు రాకు పోతే ఈ వేళ నాగౌరవ ప్రతిష్ఠలన్నీ- లోకంలో వ్యాపిం చిన నా మంచితనం అంతా- బూడిదలో కలిసిపోయేది (నిట్టూరుస్తాడు)

శా :- శాంతించు నాయనా- ఆ పసిపాప!

కే :- వాడే నా ప్రణయస్మృతి- నా ఆత్మశాంతి.

శా :- అమాయకుడైన ఆపసిపాపను చూచిఅయినా, ఈ త్రాగుడు పిశాచానికి దూరంగా ఉండు- ముక్కుపచ్చలారని ఆకుర్రాడికి ద్రోహంచేయకు. మాజీవితాన్ని చూడు- నీ జీవితాన్ని సింహావలోకనంచేసికో- మాజీవితంలోని దురంతానుభవాన్ని పురస్కరించుకొని నీ జీవితాన్ని సరిదిద్దుకో- నేను నీతల్లిలాంటిదాన్ని- చెప్తున్నా- త్రాగుడుమాను- నీవైద్యవృత్తినే నీజీవితానందంగా చేసుకొని- నీరక్తాన్ని పుణికిపుచ్చుకొని, కన్ను తెరచిన ఆ పసిపాపను నీ పవిత్ర ప్రణయచిహ్నంగా భావించుకొని- ఆత్మశాంతిని అలవరచుకో.

కే :- (లేచి) అమ్మా- నేనింక త్రాగను- త్రాగితే మా అబ్బాయికే కాదు ద్రోహంచేయడం మీకు ద్రోహంచేసిన వాణ్ణి అవుతాను- త్రికరణశుద్ధిగా- ఇదిగో వాగ్దానం- మీ సాక్షిగా-

శా :- ఆగు నాయనా- నాసాక్షిగా కాదు.

కే :- దేవుడు సాక్షిగా!

శా :- నరులు చేసేపనికి దేవుడు సాక్షి ఎందుకు నాయనా- (గోడమీదఉన్నా మహాత్మ గాంధీ చిత్రాన్ని చూపిస్తూ) అడుగో మహాత్మ గాంధి- మద్యపాన నిషేధానికి మూలవిరాట్ స్వరూపుడు- దీన దరిద్రనారాయణుడు- ఆమహాత్మ గాంధి సాక్షిగా-

కే :- ఆ- (చిత్రం దరికి వెళ్లి నమస్కరించి) మహాత్మాజీ!

నీసాక్షిగా త్రికరణశుద్ధిగా వాగ్దానం చేస్తున్నాను- ఇంక త్రాగనని- మునుమ్మాటికి త్రాగను! నేనే కాకుండా నాలా త్రాగి తమ జీవితాన్ని తమ భార్యా పుత్రుల జీవితాల్ని దుర్భరాతి దుర్భరంచేస్తూ తెలియని స్థితిలో అమానుష కృత్యాలెన్నో చేస్తూ బురదలో తందనాలాడేవారిని త్రాగకుండా చేయడానికి- మద్యపాన నిషేధం పూర్తిగా అమలు పడేలా చూడడానికి సర్వశక్తులా ప్రయత్నిస్తా.

శా :- తథాస్తు- మాఅబ్బాయి ఎంతజబ్బులోఉన్నా ఎందుకో చెప్పలేనంత ఆనందంగా ఉంది నాకు.

(తెరలో హారన్ చప్పుడు- నారాయణ పెట్టితో ప్రవేశం ఒక్కసారే)

నా :- వీరేనమ్మా డాక్టరు కేశవమూర్తిగారు.

కే :- అహా! (పెట్టెనందుకుంటాడు)

— తెర —

# శాస్త్రి

రచన 16-12-58.

పాత్ర సూచి

ప్రభాకరరావు ...

రామనాథము ... ప్రభాకరరావు స్నేహితుడు.

గిరిజ ... ప్రభాకరరావు భార్య.

సుశీల ... ప్రభాకర రామనాథములతో ఒక్క-
కాలేజీలో చదువుకొన్నది.

రంగము :- ఒక సామాన్యుని ఇంటి ముందు చావిడి. ఆ చావిడిలోనుండి గదిలోపలికి వెళ్ళడానికి బయటకు వెళ్ళడానికి ఎదురుఎదురుగా రెండు ద్వారాలుంటవి. ఆ రెండు ద్వారాలకి తెరలు వ్రేలాడుతుంటవి. చావడిలో ఒక ప్రక్కగా బల్ల. దానిమీద పుస్తకాల షెల్ఫ్. దానిప్రక్కన కుర్చీ. రెండు కుర్చీలు సరసను ఈజీచైర్. దానిప్రక్క ఓచిన్నబల్ల. దానిమీద ఒక వారపత్రిక, ఒక దినపత్రిక- గోడమీద అందమైన క్యాలెండర్లు, 6వ తారీఖుని సూచిస్తుంటవి. గోడ మూల బల్లమీదఉన్న అలారం టైంపీస్ 7 గంటలను సూచిస్తుంటుంది. అది సామాన్యుల ఇల్లైనా కళాత్మకంగా అలంకరింపబడి ఉంటుంది. బల్లమీద అద్దం, దువ్వెన- ఒక కుర్చీ చేతిమీద తువ్వాలు.

సమయం :- సాయంకాలం 7 గంటలు. బయట గాలి వర్షం జల్లుజల్లుగా ఒక్కొక్కసారి హోరుగా- కిటికీలలోనుంచి

వచ్చినగాలివల్ల తెరలు, క్యాలెండరు కాగితాలు రెపరెప లాడుతుంటవి. ఆ చావడిలో దీపం లేకపోవడం మూలాన మసకచీకటిగా ఉంటుంది తెర లేచేటప్పటికి.

ప్రవేశం :- ఇద్దరుస్త్రీలు వీధితలుపు తెసికొని. వర్షం జల్లు, గాలి వారితో లోనికి రావడంచేత వీధితలుపులు బలవంతంమీద వేస్తారు. అందులో ఒక ఆవిడ ఆ ఇంటి గృహిణి. ఆవిడపేరు గిరిజ 25 ఏండ్లుమీరి ఉంటవి. ఆమె వస్త్రధారణ సంసారపక్షంగానేఉన్నా ఆ కర్షణీయంగా ఉంటుంది. సంస్కారం ఉన్నట్లే ఆమెకళ్లు మెరుస్తుంటవి. చూడగానే గడసరిఅని పోల్చుకోవచ్చు. రెండోఆవిడ సుశీల. ఆవిడకు 20 ఏళ్లుదాటి ఉంటవి. ప్రస్తుతం కాలేజీ విద్యార్థిని. ఆమె వేషంలో అధునాతనం- మాటల్లో పెంకెతనం. కను పిస్తుంది. చేతిలో బేగ్ ఉంటుంది. వారిద్దరు వర్షంజల్లుకి కొంచెంకొంచెం తడిసినారు. గాలికి జుట్టు, పైటలు చెదరి ఉన్నవి. తొందరలో ప్రవేశించారేమో నిట్టూర్పులు వేగంగా విడుస్తుంటారు. గిరిజ స్విచ్ వేస్తుంది. చీకటిగాఉన్నా రంగం ప్రకాశవంతం అవుతుంది.

గి :- తడిసిపోయారా- (కుర్చీమీదఉన్న తువ్వాలుతీసి) ఇదిగో తువ్వాలు తుడుచుకోండి (ఇస్తుంది)

సు :-(బేగ్ బల్లమీద పెట్టి తువ్వాలుతీసికొని తుడుచుకొంటూ) అబ్బా! ఏంగాలి! ఏంగాలి- ఎలాగయితే ఇంటికి చేరాం- జల్లు ప్రారంభించింది. మీతో రానని మొండికేస్తే ఏమయ్యేదో

నాపని ఈవర్షంలో (తువ్వాలు ఇచ్చివేస్తుంది)

గి :- (తుడుచుకుంటూ) అరమరికేమీ పాటించకండి- ఇది స్వగృహంగానే భావించి-

సు :- బాగాఅన్నారు- అంతకన్నా చేయవలసిందేముంది.

గి :- ఎంతలో ముంచుకు వచ్చేసిందండి- చూస్తుండగా.

సు :- అందుకనే వానరాకడ ప్రాణం పోకడ ఎవరికీ-

గి :- తెలియదంటారు. కాని- మీకు వర్షంవస్తుందని తెలిసి ఉన్నా బయలుదేరేవారే మీ ఊరునుంచి-

సు :- ఆ- తప్పకుండా.

గి :- పని అటువంటిది- మరి.

సు :- నాపనిసంగతి మీకేం తెలుసు.

గి :- పొరుగూరు ఒక్కరూ వచ్చారంటే- ఇంకా నిలబడే ఉన్నారు. అలాకూర్చోండి, ఈజీచైర్‌లో- నేను వెళ్లి కాఫీప్లాస్కు తెస్తా. (బల్లమీది అద్దం దువ్వెనతీసిచ్చి) ఇదిగో (అనిఇచ్చి) అలా విశ్రాంతిగా కూర్చుని రేగినతల సవరించుకోండి-

సు :- రేగినతలైతే సవరించుకోంటాం-

గి :- రేగిన హృదయమంటారా-

సు :- బాగా గ్రహించారు.

గి :- గ్రహించడానికేముంది- వయస్సులోఉన్న-

సు :- వయస్సులోఉన్నా- హా! హా! హా! (నవ్వుతుంది)

గిరిజ (నవ్వకుండా తెరతొలగించుకొని లోనికి వెళ్లుతుంది)

సు :- (ఇల్లంతా కలయచూచి) అద్దంతీసి కనిపించేటట్టుగా బల్ల

మీదపెట్టి, తల, పైట సరిదిద్దుకొని ఈజీచైర్‌లో కూర్చుండి బల్లమీద వారపత్రిక తీయబోతుంది.)

గి :- (ప్రవేశం ఫ్లాస్కుతో)

సు :- (పత్రిక చేతితోపట్టుకొని) మీరీసమయాన ఆదుకోక పోతే- నేనీగాలివానలో- ఊరుగానిఊరులో.

గి :- (ఫ్లాస్కులోనుంచి గ్లాసులో కాఫీపోస్తూ) అలా అస్తమాను అంటారేమిటి-నేనుకాకపోతే ఇంకోరు- దేవుడులేడూ! (కాఫీగ్లాసు సుశీలకు అందిస్తుంది)

సు :- (తీసికొని) ఉన్నాడనుకోండి- ఆసమయానికిమాత్రం మీరే దేవుడిలా రావడం- నాకు తారసిల్లడం-

గి :- మేం సాయంకాలంవేళ సాధారణంగా పార్కుకు వస్తుంటాము.

సు :- మీఆయన లేరేమీతో.

గి :- మీకు చెప్పడంమరచా- ఆయన పనిమీద ఊరువెళ్లారు ఈసాయంకాలానికి రావలసిందే-

సు :- ఏదైనా అత్యవసరకార్యం-

గి :- ఇల్లువిడిచి బయటకువెళ్లితే ఎక్కడలేని అత్యవసర కార్యాలు వచ్చిపడతవి మగాళ్లకి- ఇల్లు- పెళ్లాం-

సు :- బాగాచెప్పారు- ఏంచేస్తారు మీవారు.

గి :- బి. ఏ. ప్యాస్‌అయి రెండేళ్లు కూర్చుంటే మానాన్న గారి ధర్మమాఅంటూ ఈ రెవిన్యూ ఇనిస్పెక్టరు-

సు :- ఆరెవిన్యూ ఇనిస్పెక్టరులోనుంచే కలెక్టరు ఉద్యోగం

లోకి వెళ్లారు మానాన్నగారు- ముందుముందు- పెద్దఉద్యోగం-

గి :- ఏం ముందు ముందో- అలా అనుకొనే రెండేళ్లనుండి కాలక్షేపం చేస్తున్నాం- ఎక్కడఉన్నావు గొంగళీఅంటే వేసినచోటనే ఉన్నానన్నదట. అలాఉంది మాపని.

సు :- మీవారు ఏకాలేజీలో చదివారు-

గి :- కాకినాడ కాలేజీలో.

సు :- మాకాలేజీలో అన్నమాట.

గి : మీరూ అక్కడే చదువుకున్నారా! అక్కడనుంచేనా రావడం-

సు :- అది మాఊరే-

గి :- మీకు ఎంచక్కా కాలేజీలు, ఊళ్లూకూడా ఉన్నవి. ఇంకే (నవ్వుతుంది)

సు :- అదికాదండి (నవ్వుతుంది)

గి :- (నవ్వుతూ) ఏం చదువుతున్నారు.

సు :- బి. ఏ.

గి :- ఇంకే- బి. ఏ. అయితే మీకో ఉద్యోగం.

సు :- నాముఖానికి ఉద్యోగంకూడానా.

గి :- ఉద్యోగాలుచేసే ముఖాలు వేరేఉంటవా?

సు :- చదువుకున్నంతమాత్రాన ఉద్యోగాలుచేసి ఊళ్లేలాలని ఉందా-

గి :- మరి-

సు :- చదువుకొన్నా చదువుకు అదేనా ప్రతిఫలం- చదువు

కోవడం- విజ్ఞానంకోసమని నాఉద్దేశం.

గి :- మంచిదే- ఉద్యోగం పురుషలక్షణ మన్నారుగా-

సు :- మేం పురుషులం కాముగా.

గి :- అయితే ఏ అయ్యనో-

సు :- ఏ అయ్యనో- (నవ్వుతూ సిగ్గుతో తలవంచుకుంటుంది)

గి :- పెళ్లిమాటంటే- "ఎక్కడినుండివచ్చె తరళేక్షణకు న్నను సిగ్గుదొంతరల్".

సు :- ఆనాడు మీకూవచ్చిఉంటుంది సిగ్గుదొంతర-

గి :- అయితే మీఉద్దేశం మంచిదే- చదువు పూర్తిఅయ్యాక మనస్సుకునచ్చినవానినిచూచి- తలయూచి- పెళ్లాడిపోయిగా-

సు :- పెళ్లాడి- పోయిగా- అది ఎంతటి అదృష్టవంతులకో-

గి :- (ఆమెకేసి తీక్షణంగాచూస్తూ) మీరు చిన్నవారైనా అనుభవమైన మాటచెప్పారు- నిజమే- (దరికివచ్చి) నేనో మాట అగుతాను ఏమనుకోకండి-

సు :- ఏమనుకోవడం ఎందుకండి- మంచివారే-

గి :- చూడండి- మీరుకాని-

సు :- కాని- కాని-

గి :- ఎవరినైనా

సు :- హా! హా! నేనుగాని ఎవరినైనా-

గి :- ప్రేమించారా!

సు :- ప్రేమించానా అంటారా- (నవ్వుతూ) బాగాఅడి...ు.

గి :- ఏం!

సు :— ప్రేమించానా నేను ప్రేమించానా (నవ్వుతుంది విరగబడి)

గి :— ఇందులో తప్పేముందండి— ఆడవాళ్ళమయ్యాక ప్రేమించకుండా ఉంటామా— పెళ్లి చేసుకోకుండా ఉంటామా.

సు :— (నవ్వుతూనే) ఇంకా అనండి—

గి :— అనడానికేముంది— బిడ్డల్ని కనకుండా ఉంటామా—

సు :— (నవ్వుతూనే) ప్రేమ— పెళ్ళి— పిల్లలు—

గి :— ఆడదానిజీవితం—

సు :— (నవ్వడం మానివేసి) నిజమే— నిజమే (నిట్టూరుస్తుంది)

గి :— ఏమండీ అలా నిట్టూరుస్తారు—

సు :— నిట్టూర్పులుగాక!

గి :— నాకు చెప్పకూడదూ?

సు :— పెళ్ళి, పిల్లలుమాట నాకు తెలియదుగాని ప్రేమిస్తే ఎంతబాధో—

గి :— అందుకనేనా ఈఊరువచ్చారు-

సు :— (తేరుకొని) అబ్బే! అబ్బే— చెప్పానుగా—

గి :— ఏంచెప్పారు— రైల్లో వెళ్లుతూ ఆగిన స్టేషన్లోదిగి కనిపించిన స్నేహితురాలితో టీ త్రాగుతూ రిఫ్రెష్‌మెంటులో కూర్చుంటే— ట్రెయిను కాస్తా చక్కాపోయిందని— మళ్ళీ యింకో ట్రెయిన్ 10 గంటలదాకా లేకపోవడంచేత కాలక్షేపంకోసం- పార్కుకి వచ్చానని చెప్పారు.

సు :— అంతే— అంతే—

గి :— అంతే కాదంటాను—

సు :- (కొంటెగా) అయితే ఏమంటారు మరి.

గి :- నేనే మంటానంటే- మిమ్మల్నే చెప్పమంటాను నిజం-

సు :- (నానుస్తూ) లేదండీ- నిజమేనండీ.

గి :- ఇంక నన్ను డబాయించకండి- మీరు సమాధానము చెప్తూతున్నప్పుడే- మీమాటలుతీరు మీముఖ కళవళికబట్టి కనిపెట్టాను- మీరు చెప్తూతున్నది స్వకపోలకల్పిత మని-

సు :- ఆ-

గి :- ఆ- అనిఆశ్చర్యపోతా రేమిటి- మీకన్నా ఈలోకంలోకి 5, 6 ఏళ్లు ముందువచ్చానని మరచిపోకండి.

సు :- అయితే?

గి :- మీకు పుస్తకానుభవమేకాని- నాకు దానితోపాటు లోకానుభవంకూడా

సు :- ఉండవచ్చు- నేను కాదనడంలేదుగా-

గి :- అందుకనే మీరుచెప్పినది వట్టి కల్పితకథఅని అంటాను.

సు :- అయితే మీలోకానుభవంతో ఊహించండి చూద్దాం.

గి :- చూడండి. నే నూహల్లో గట్టిదాన్ని- సరిగ్గా ఊహించేస్తాను- అప్పుడు మీరు చిక్కుల్లో-

సు :- ఇంతకన్నా చిక్కులా- అయినా తప్పించడానికి మీరున్నారుగా.

గి :- చెప్పమంటారా అయితే!

సు :- ఆ-

గి :- మీరే చెప్పుదురు- నన్నెందుకు బాధపెట్టుతారు-

సు :- చెప్పుదురు- ఫరవాలేదు.

గి :- చెప్పనా- అయితే- (ఆలోచించి) చెప్పమంటారా- మీరు ఎవరినో-

సు :- ప్రేమించానంటున్నారు- అవునా (నవ్వుతూ) ఇందాక టినుంచి అంటున్నారు ఆమాట.

గి :- ఆ- ఆ- అవునా?

సు :- తరువాత.

గి :- తరువాత మీరు మనసారా ప్రేమించిన ప్రియుడు-

సు :- తరువాత- తరువాత.

గి :- తరువాత నో దేవీ- ఒక చక్కని ప్రణయలేఖ-

సు :- (నవ్వుతూ) ప్రియుడు- ప్రణయలేఖ- ఏమనీ.

గి :- "దేవీ! నేను గాఢ వియోగవేదనాదో దూయమాన-

సు :- (నవ్వుతూ) ఆగండి- ఆగండి. అంతంత పెద్దసమాసాలు నాకర్ధంకావు- తెలుగులో నేను చాల పూర్.

గి :- అయితే వినండి. ఏమని వ్రాసాడంటే- ఈఊరువచ్చి పార్కులో వేచిఉండమని- నేనునీకోసంఎదురు తెన్నులుచూస్తూ-

సు :- అందుకనే వచ్చానంటారా- (నవ్వుతూ) అందుకనే వచ్చానంటారా- (దిగులుగా) అలాగయితే- నన్నురమ్మని వ్రాసిన ప్రియుడు, నాకోసం తపించే ప్రియుడు పార్కులో నేనెదురు తెన్నులు చూస్తూన్నా ప్రియుడు- ఏడీ- మరి- ఏడీ- (అని కుర్చీలోకూలబడి నిట్టూరుస్తుంది.)

గి :- (దరికివచ్చి) మిమ్మల్ని రేపి బాధపెట్టాను- బాధపడితే

వచ్చేదికాదు- బాధ స్త్రీనోసటనే ప్రొద్దుపొడిచింది- మనకీ కాస్తలో కలిగిన చనవు పురస్కరించుకొని ఇలా అన్నాను- ఏమీఅనుకోకండి. క్షమించండి.
సు :- (ఆమె చేతులుపట్టుకొని) క్షమించడాని కేముందండి- మీరు కానిమాట అన్నారుగనుకనా జోస్యునిలా అంతా నిజంచెప్పారు.
గి :- నాకు తెలుసు.
సు :- మీకెలా తెలుసు.
గి :- తెలియడం కాదమ్మా- ఊహించ లేననుకొన్నారా?
సు :- చక్కగా ఊహించారు.
గి :- నేను చెప్పలేదటమ్మా- ముందే నేనూహించేస్తానని- అయితే-
సు :- ఆప్రేమించిన వారెవరంటూరా.
గి :- నేనడగనూ అడగనూ- మీరు చెప్పనూ చెప్పవద్దు- ఇదివరకే మిమ్మల్ని బాధపెట్టాను. ఇంటికి తీసుకొనివచ్చి ఇలా అన్నానని అనుకోకండి. ఇలా చూడండి. పార్కులో మీరు చూచేతీరుచూచి మీముఖ కళవళికలనుచూచి ఈ అమ్మాయి "ఓ ప్రేమ పక్షి" అనుకున్నాను-
సు :- "ప్రేమ పక్షి"- ఇదేమిటండోయి (నవ్వుతుంది.)
గి :- మేం కాలేజీలో చదుకొనే రోజుల్లో మాటఅది- ప్రేమలో పడి కొట్టుకునేవాళ్లని ప్రేమపక్షు లనేవాళ్లం అది, ఇప్పుడు చటాలున జ్ఞాపకం వచ్చింది- పోనీలెండి, ఈసోదికేంగాని-

నేను లోపలికి వెళ్లి ఫలహారాలు తెస్తాను- ఈలోగా మా ఫేమిలీ ఆల్బమ్ చూస్తుండండి (పుస్తకం తీసి ఇచ్చి) ఇందులో మా అమ్మగారి, మావారి కుటుంబాల బొమ్మలున్నవి- చూస్తూ ఉండండి- ఉబుసుపోతుంది,

సు :- (అందుకొని) కలతగా ఉన్న మనస్సుకి చిత్రదర్శనం ప్రశాంతిని ప్రసాదిస్తుంది- అవునుగాని ఫలహారం అంటున్నారు. మీరు భోంచెయ్యరూ.

గి :- ఇవ్వాళ శనివారం- భోజనం లేదు కాని తత్తుల్యమైన ఫలహారం- మీ భోజనానికి ఏర్పాటు చేస్తా.

సు :- నాకూ శనివారమే.

గి :- ఉభయకుశలోపరి- ఆల్బమ్‌తో కాలక్షేపం చేస్తుండండి- ఫలహారాలు తెస్తా (నిష్క్రమణ)

సు :- (ఈజీచైర్‌లో కూర్చుని ఆల్బమ్ సావకాశంగా ఒక్కొక్క పేజీ తిరగవేస్తూ ఒకచోట ఆగి) "ప్రేమ పక్షి" అని నవ్వుతూ పేజీ తిరగవేసి ఆ పేజీలో బొమ్మచూస్తూ నవ్వు మానేసి- 'ఆ' అని లేస్తుంది- ఆల్బమ్‌తో దీపం దగ్గరగా వచ్చి బొమ్మని నిదానించి చూచి- "ఏమీ సందేహం లేదు- ఏమిటీ చిత్రం. అతడే- ఒక్కటే పోలిక- ఈమె (ద్వారం కేసి చూస్తుంది) పెళ్లినాడు తీయించుకొన్న ఫొటో (అని ఆల్బమ్ బల్లమీద పెట్టివేసి పచారు చేస్తూ) ఇప్పుడెలా- ఎలా (కూర్చుండి లేచి) ఇక్కడ ఒక్క నిమిషం ఉండకూడదు-

ప్రవేశం గిరిజ. (రెండు ఫలహారాల పళ్లాలతో. వాటిని బల్ల

మీాదఉంచి సుశీలకేసిచూాస్తూ దగ్గరకు వెళ్లుతుంది)

సు :- (తచ్చాడుతూా) ఇప్పుడు తెలిసింది.

గి :- ఏమి తెలిసింది.

సు :- నేనిప్పుడెక్కడున్నానో!

గి :- ఎక్కడున్నారు.

సు :- (చటాలున ఆగి) నన్ను పార్కులో కలిసికోమని- నీవిరహం సహించలేకుండా ఉన్నానని- నీకోసం ఎదురు తెన్నులు చూాస్తుంటానని- వ్రాశాడే- వారింటిలో-

గి :- అయితే.

సు :- అందుకనే ఊహించాను. ఊహించానని- నాసంగతి పూసగ్రుచ్చినట్లు చెప్పేశారు- అలారమ్మనివ్రాసి తానెందుకు రాలేదో నాకిప్పుడర్థమయింది- మీారు నాకోసమే పార్కుకు వచ్చారు- అవునా?

గి :- ఆ- నీకోసమే.

సు :- నచ్చిక బుచ్చికలాడి మీాయింటికి తీసికొనివచ్చి నా నిష్ఠుర ప్రణయగాథను నామొగంమీాద త్రిప్పికొట్టి- నన్ను కించపరచి- హీనపరచారు.

గి :- అదిమాత్రం అబద్ధం.

సు :- మీా అబద్ధాలు సబద్ధాలతో నాకు నిమిత్తంలేదు- నేనిక్కడ ఒక్కనిమిషం ఉండను- వెళ్లిపోతా- ఏది నా బేగ్

గి :- ఇంత గాలి వానలో- ఇంత చీకటిలో.

సు :- ఇంక నాపయి జాలి చూపించకండి- హృదయంలో

రేగిన గాలివాన కన్నా ఇది ఎక్కువా?

గి :- ఆవేగ పడకండి- (అడ్డుగా వెళ్లుతుంది)

సు :- అయితే మీకన్నీ తెలుసునన్నమాట.

గి :- అన్నీ తెలియవు.

సు :- మీా ఆయనే చెప్పారా?

గి :- లేదు.

సు :- అబద్ధం- జోస్యునిలా ఊహించానంటారా ఇంకా.

గి :- గిరిజ అబద్ధమాడే మనిషి కాదు.

సు :- మరి-

గి :- మా సంసారమన్నా మేమన్నా, ఇష్టమున్నా ఆయన-నా సంసారం ధ్వంసం అయిపోతుందనే భయంతో- మీారు ఆందోళన చెందకండి శాంతి పడండి. ఇలా కూర్చోండి (కుర్చీమీాద కూర్చోపెట్టుతుంది)

సు :- నాసంగతి తెలిసికూడ నన్ను మీాయింటికెందుకాహ్వానించారు-

గి :- మనం ఎప్పుడో ఒకప్పుడు కలసికోవలసినవారమేగా-

సు :- ఎలా?

గి :- ఒకే పూవుకోసంవచ్చిన రెండు తుమ్మెదలు ఒకే చోట వాలడంలో అసంభవమేముంది.

సు :- ఆ- ఆ!

గి :- (ఆమె దగ్గరగా ఉన్న బల్లమీాద కూర్చుండి ఆమె చేతిని తనచేతిలోకి తీసికొని) చూడండి ఎందుకంత ఆవేశంపాలవు

తారు– ఇందులో ఏముంది. అలజడిపాలవడానికి– చూడండి. మీరు మనస్సువిప్పి–

సు :– ఇంకేమిచెప్పను– నేనెవ్వరినో తెలిసిపోయింది– ఊరు గానిఊరు ఒంటరిగా ఎందుకు వచ్చానో తెలిసిపోయింది– పైగా ఎవరికోసం వచ్చానో తెలిసిపోయింది. ఇంకేమిచెప్ప మంటారు– నన్ను క్షమించకండి ఇంక ఉండనిక్కడ– వెళ్లి పోతా– మీఆయన వచ్చేలోగా వెళ్లిపోవాలి– (లేవబోతుంది)

గి :– (ఆమెను కూర్చోపెట్టి) తొందరపడకండి– ఇంతగాఢాంధ కారంలో తెలియని ఊళ్లో ఒక్కరూ అందులో ఆడాళ్లు. కన్నూకన్నూ కానరాని కటికచీకటిలో, కాలుతీసి కాలుపెట్ట లేరు– మావారు బహుశా ఇవాళరారు– వచ్చినా– మీఆయ నకు మీరు కనబడకుండా ఉండాలని ఉంటే– ఆసహాయం కూడాచేస్తా.

సు :– అయితే నన్నిప్పుడేమి చేయమంటారు.

గి :– మీమనస్సు విప్పి–

సు :– మీకన్నీ తెలుసుగా.

గి :– నాకేమితెలుసు– తెలుసుకోవలసినవి చాలాఉన్నవి.

సు :– ఏమిటి ?

గి :– చూడండి– మాస్నేహితులు తలచినట్లు– మాసంసారం ఛిన్నాభిన్న మయిపోతుందనే విచారం నాకు లేదు– స్వార్థం కోసంకాదు నేనడుగుతుంట– మనల్ని మనం అర్థంచేసికొని మనజీవితాల్ని సరిదిద్దుకోవడం మంచిదని.

సు :- ఏం చెప్పమంటారు.

గి :- అడుగుతాను ఏమనుకోకండీ,

సు :- అనుకున్నా తప్పుతుందా.

గి :- అలాగయితే అడగనే అడగను. మీకిష్టంలేకపోతే-

సు :- (నిట్టూర్చి) అడగండి.

గి :- మీరు మనసారా మాఆయన్ని ప్రేమించారా ?

సు :- (మాటాడక తలవంచుకొంటుంది)

గి :- మనసారా- ప్రతిఫలాకాంక్ష లేకుండా !

సు :- ఆ (నిట్టూరుస్తుంది)

గి :- మాఆయనకోసం- మీతల్లిదండ్రుల్ని- మీచదువుని- మీఆస్తిని- మీబంధుజనాన్ని విడిచిపెట్టివేయడానికి సిద్ధమేనా?

సు :- అలాఅనుకొనే నాసర్వస్వం విడిచివచ్చేశా.

గి :- మాఆయన మీకోసం నన్నూ నాసంసారాన్ని- మా ప్రేమనీ విడిచిపెట్టివేస్తారనే మీఉద్దేశమా ?

సు :- (మాటాడక ఆమెకేసి చూస్తుంది పులుకుపులుకుమని)

గి :- (నిట్టూర్చి) మాటాడరే- నేనూ వారిని ప్రేమించాను. మనసారా ప్రేమించాను. ప్రతిఫలాకాంక్ష లేకుండా ప్రేమించాను- మాపెళ్ళికి అనేకమైన అవాంతరాలు వచ్చాయి- అన్నీ ఆయన దీక్షవల్ల, నాఅర్చనవల్ల పటాపంచలయ్యాయి. మేం పెళ్లిచేసుకొన్నాం- ఆయన బి. ఏ. చదువుతుండగానే మావివాహం జరిగింది- మాయిద్దరిమధ్య ఏలాటి పొరపొచ్చాలుగాని, ఎలాటి రహస్యాలుగాని లేవు- ఆయన పెళ్లైన

క్రొత్తలో తన కాలేజీలో ఓ అమ్మాయి ఉత్తరాలు వ్రాస్తుండేదని- అన్నీ బుట్టదాఖలా చేసేవాణ్ణని చెప్పేవారు- అంత కన్నా ఇంకో స్త్రీతో పరిచయమున్నదన్నైనా నాతో చెప్పలేదు- చెప్పిఉన్నా నేనాయన్ని క్షమించి ఉందును- ఒక స్త్రీకి ఇంకొక స్త్రీ తన ప్రేమమార్గంలో అడ్డుగా నిలబడడం ఇష్టముండదు- అయినా నేను సహించి ఉందును- ఎందుకంటే ఆయనమీద నాకంత ప్రేమ- పెళ్లి చేసికొని 5, 6 సంవత్సరాలయినా మా ప్రేమ- దినదినాభివృద్ధి చెందుతున్న దేగాని కొందరి ఉద్దేశంలో లా మాసిపోవడం లేదు. ఇప్పటికీ- ఎప్పటికీ మాయను- వారికీ నామీదా అంతే- కాని_ కాని- ఇప్పుడు అనుకోవలసి వస్తుంది- నాపట్లచూపిన ప్రేమ- అంతా బూటకమని- నటనఅని- మగ వాళ్లు బూటకపు జీవితం గడపడంలో ఎంతైనా-

సు :- ఆగండి- నన్నింక చెప్పనీయండి- మీకు పెళ్లైన క్రొత్తలో ఒక కాలేజీ అమ్మాయి ఉత్తరాలు వ్రాస్తుండేదని చెప్పేవారే మీవారు- ఆ అభాగినిని నేనే- నిజమే- ఎప్పుడు నాఉత్తరానికి ప్రత్యుత్తరం వారిదగ్గరనుంచి రాలేదు- ఆయన్ని మనసారా ప్రేమించాను. కనుక నే- ప్రేమలోని దివ్యత్వాన్ని ఎరుగుదును, కనుకే ఆయనదగ్గరనుంచి ఉత్తరం రాకపోయినా, ఆయన నన్ను ప్రేమించకపోయినా, నా ప్రేమో పాసన పీసమైనా చలించలేదు- నాకెన్నో సంబంధాలపై సంబంధాలు వచ్చాయి- అన్నీ తిరగగొట్టేను- ఆనాటినుంచి ఈనాటివరకు ఆయన్నే తలచుకుంటూ తలపుల్లో పూజించు

కొంటూ- పూజల్లో పరవశమవుతూ ఇన్నాళ్లు గడపాను. ఇలాగే జీవితాంతం గడుపుదామనుకున్నాను- కాని- నాలుగు నాళ్ల క్రితం మీవారిదగ్గరనుంచి ఉత్తరం- క్రుంగిన ఆశలు రెక్కలుదాల్చాయి- వసివాడిన హృదయం మళ్ళీ చిగిరించ డానికి-

గి :- అంతకు ముందెప్పుడూ మావారు ఉత్తరం వ్రాయలేదా-

సు :- ఆనాటికీనాటి కిదేనా మొదటి ప్రణయలేఖ-

గి :- దానికి సమాధానం వ్రాశారా?

సు :- ఆ!

గి :- మాఆయనపేరే వ్రాశారా?

సు :- లేదు- ఏదో పేరుతో Co/. Post Master అని వ్రాయ మన్నారు.

గి :- అహా! వారిపేర వ్రాయలేదన్నమాట- ఆయనకు మీ ఉత్తరం- (ఆలోచించి) సరేగాని ఆయనకు వివాహమైనట్లు తెలుసా?

సు :- తెలుసు- తెలియకే! ఆయన సంసారజీవితం దుఃఖ భాజనమని-

గి :- ఆ- మాసంసారం దుఃఖభాజనమని- ఎవరన్నారు?

సు :- మీవారు.

గి :- ఎప్పుడు.

సు :- ఉత్తరంలో (పెట్టెలోనుంచి ఉత్తరంతీసిచ్చి) చదవండి మీకే తెలుస్తుంది.

గి :- (నిట్టూరుస్తూ) ఆయన ఇంకొకరికి వ్రాసిన ప్రణయ లేఖ (కంపితహస్తాలతో పుచ్చుకొని) మీకు వ్రాసింది నేను చదవడం దేనికి (ఇచ్చివేయపోతుంది)

సు :- మనస్సులోని అపోహలు పోగొట్టుకుంటామని మీరేగా అన్నారు.

గి :- పాడుమనస్సు- బాగా జ్ఞాపకం చేశారు. అవును (ఉత్తరం వణకు చేతులతో విప్పి చదువుతుండగానే ఆమె ముఖంమీద హాస రేఖలు ప్రస్ఫుటమవుతుంటవి. కొంచెం చదివి చదవడం మానివేసి నవ్వుతుంది పకపక)

సు :- (బిత్తరిపోయి) ఏం-ఎందుకలా నవ్వుతారు?

గి :- ఎందుకా- ఎందుకా (నవ్వుతూ) ఈఉత్తరం చదివాక, చూచాక, నాహృదయభారం తగ్గింది (నవ్వుతుంది)

సు :- ఏం-

గి :- ఈఉత్తరం మావారు వ్రాయలేదు కనుక.

సు :- ఆ- ఏమన్నారు?

గి :- ఈఉత్తరం మావారు వ్రాసింది కాదు!

సు :- మరి!

గి :- మావారి వ్రాతకీ ఈవ్రాతకీ సంబంధం లేందే!

సు :- తెలియకుండా ఉండాలని వ్రాతమార్చి వ్రాయకూడదా?

గి :- ఇందులో వాడిన గ్రాంధిక భాష, సినీమాల్లోని భావాలు, మావారు జన్మలో ఉపయోగించరు.

సు :- (కుర్చీలో నానుకొని) ఆ- అయితే ఇది మోసమంటారా-

చూడండి ఏస్నేహితుని చేతనైనా వ్రాయించారేమో కూవారు.
గి :- (తెల్లబోయి) ఆ- ఆఊహనాకు తట్టనేలేదు- నిజమేమో- ఎవరిచేతనైనా వ్రాయించారేమో- మగాళ్ళని నమ్మమని ఎవరుచెప్పారు?(నిట్టూరుస్తూ) అయినా ఉండండివస్తా. ఆయన వ్రాసిన ఉత్తరాలు తెస్తా (నిష్క్రమణ)
సు :- (ఆమె వెళ్లిన దారికేసిచూస్తూ నిట్టూరుస్తుంది)
(ఇంతలో తలుపుచప్పుడు).
సు :- ఎవరో వచ్చారండీ. (ద్వారంకేసిచూస్తూ చెప్తుతుంది)
(గిరిజ ఇంకా లోనుంచి రాదు. తలుపుచప్పుడు వినిపిస్తుంది)
సు :- (వెళ్లి తలుపుతీస్తుంది) ఆ- మీరా!
ప్రవేశం :- (ప్రభాకరం చేతిసంచీతో, సుశీలను తేరిపారచూచి వెనక్కి అడుగువేసి) నేను కల గనడంలేదుగదా-ఎన్ని సంత్స రాలయిందిచూచి- నమస్కారం. (తలుపు గడియవేసేస్తాడు)
సు :- నమస్కారం- నమస్కారం- (వెనక్కి తగ్గుతుంది)
ప్రవేశం :- (గిరిజ వీరిద్దరినిచూచి తెరప్రక్కకి వెళ్లిపోతుంది)
ప్ర :- వస్తున్నట్లు ఉత్తరమైనా వ్రాశారుగారే ముందుగా మాఆవిడ నేను స్టేషనుకు వచ్చేవాళ్లం.
సు :- (తడబడుతూ) ఆ- నేను ఈఊరుకు రావడమే అకస్మా త్తుగావచ్చా- కొన్ని వస్తువులు కొనుక్కుందామని వచ్చా- ఈఊరిలో మీరున్నారని తెలుసుగా. మిమ్మల్ని చూచి చాలా సంవత్సరాలయిందామె- ఏనాడో చూచా! ఈ ఊరువచ్చి

మిమ్మల్ని చూడకుండా-

ప్ర :- చాల సంతోషం.

సు :- నాకున్నూ.

ప్ర :- ఈఊరిలోదొరికే గొప్ప వస్తువులేమిటో-

సు :- ఓహోహో- మీకింకా తెలియదు కాబోలు- తెలిసి ఉంటే-

ప్ర :- ఏమిటీ?

సు :- నావివాహం (తల వాల్చుకుంటుంది)

ప్ర :- మరీ సంతోషం- చూచారు మీరు వ్రాసిన ఉత్తరాలన్నీ ఏనాటి కానాడే దగ్ధంచేసేవాణ్ణి.

సు :- అందుక్కా-మువస్త్ర- బట్టలు ఏమికొనుక్కో-వాలో - వస్తువు లేమిచేయించుకోవాలో-

ప్ర :- నాకంటే మాఆవిడ ఆవిషయాల్లో అందెవేసినచెయ్యి-

సు :- అన్నీ మాటాడాను ఆమెతో-

ప్ర :- అయితే యింకే-

సు :- అదికాదండీ-

గిరిజ (తెరతొలగించుకొనివచ్చి) అదికాదండి. ఆవిడ పెళ్ళికి రమ్మని స్వయంగా ఆహ్వానించడానికి వచ్చింది.

ప్ర :- దానికేం వెళ్లవచ్చు-

(బయటనుండి) ప్రభాకరం- ప్రభాకరం!

ప్ర :- ఆ-

గి :- రామనాథం గొంతుకులాఉందే!

సు :- రామనాథం!

గి :- రామనాథంగారే, మీరెరుగుదురా.

సు :- ఎరగకే- మీఆయన క్లాసుమేటు. డేమ్ స్కాండ్రల్

గి :- ఆ-

సు :- ఇతడేనా మీ ఫేమిలీ ఫ్రెండ్- మీకేదో చెప్పింది ఇతగాడిగురించేనా-

గి :- ఆ-

సు :- ఊహూ. (గిరిజతో) ఇలా రాండి (దూరంగా తీసికొని వెళ్ళి చెవిలో ఏదో చెప్తుతుంది)

గి :- అహా- ఆ- నేను అనుమానించాను కాని- ఏమో- చూద్దాం!

ప్ర :- ఇప్పుడు రామనాథానికి మనతో ఏంపని. ఓహో- ఏదో వ్యవహారంలో కలెక్టరుతో సిఫారసుచేయమని ఉత్తరంవ్రాసి పంపాడు- అది అడగడానికేమో స్వయంగావచ్చి ఉంటాడు.

గి :- అందుకాకాదు (ఆలోచిస్తూ)

ప్ర :- ఎందుకు మరి-

గి :- ఉండండి- (ఆలోచిస్తూ) ఆ- (సుశీలతో) మీరు లోపలికివెళ్లండి. నేను పిలిచేదాకా రాకండి- (ప్రభాకరంతో మీరువెళ్ళి తలుపు తీసిరండి.

ప్ర :- ఏమిటిదంతా- నాకర్థంకావడంలే!

గి :- అంతా అర్థమవుతుందులెండి కొంచెంసేపటిలో.

(బయటినుండి) ప్రభాకరం- ప్రభాకరం.

గి :– తలుపు తీయండి– వెళ్ళండి మీరు లోపలికి (సుశీలతో)

ప్ర :– (తలుపు తీస్తాడు)

సు :– (లోనికి వెళ్ళిపోతుంది గుమ్మంలోనుంచి)

ప్రవేశం :– రామనాథం ఉండడనుకున్న ప్రభాకరం ఉండడం చేత అదోమోస్తరుగాచూస్తూ.

ప్ర :– (అతనికేసి రెప్పవాల్చకచూస్తూ) ఏం వచ్చావు.

రా :–ఏమీలే నీకు వ్రాసిన ఉత్తరంసంగతి ఏంచేశావో–

గి :– (చీరచెంగు నడుముకు చుట్టుకొని) వచ్చారూ– సమయానికివచ్చారు. (భర్తకేసిచూస్తూ) ఇప్పుడే తేలిపోవాలి. అట్టో ముక్కో– ఎంత ద్రోహం– ఎంత ద్రోహం.. ఇలాచేస్తారని ఎప్పుడైనా అనుకొన్నానా.

ప్ర :– (విస్తుపోయి అలాచూస్తూంటాడు.)

గి :– మాటాడరే– నమ్మకునీ రోత్తి నట్లూరుకుంటారే–

ప్ర :– ఏంచేశాను–

గి :– ఏంచేశాన-టారేమిటీ పైగా– జీవితం నాధ్వంసంచేసి– నాబ్రతుకులో నిప్పులుపోసి.

ప్ర :– నేను– నేను–

గి :– ఆ– మీరే.

ప్ర :– గిరీ! ఏం మాటాడుతున్నావో తెలిసే మాటాడుతున్నావా?

గి :– అన్నీ తెలిసే మాటాడుతున్నాను– ఏమయినా ఒళ్లు మరచిపోయి ఉన్నాననుకొన్నారా?

ప్ర :- అయితే ఈమాటలేమిటో?

గి :- ఈమాటలా- మీకు తెలియవు. పాప .-(రామనాథంతో) చూచారా- చల్లగాచేసేస్తారు- ఎవరు కనిపెట్టలేరనుకుంటారు- ఏం మాటలట- ఏంమాటలు- పిల్లి కళ్లుమూసికొని పాలు త్రాగుతుంటే-

ప్ర - పిల్లేమిటి- పాలు త్రాగడమేమిటి-

గి :- ఇవ్వాళ ప్రొద్దుటినుంచి- ఒక్కవరసగా నా ఒళ్లుడికిపోతున్నది. నామనస్సు నాలోలేదు.

ప్ర :- నిన్న నేనూరువెళ్లి నప్పుడేమీలేదు- ఇంతలో ఏమి వచ్చిపడింది-

గి :- పిడుగుపాటు!

రా :- (విస్తుపోతూ) మీ రూరులోలేరూ.

గి :- ఊరిలో ఉంటే లేకపోతే, చల్లగాచేసి చక్కాపోయారు- ఇంత ఘోరంచేస్తారని ఎవరైనా అనుకొన్నారా- ఎప్పుడైనా అనుకున్నానా- ముంగిలా కనిపించేవారు, ఎంత నటన! ఎంత మోసం!

ప్ర :- ఎవరుచేశారు మోసం- (తీవ్రంగా)

గి :- మీరు.

ప్ర :- నేనా- నేను- ఎప్పుడూలేంది ఇప్పుడిలా మాటాడుతున్నావే-

గి :- ఎప్పుడూ లేదుకనుకనే- (రామనాథంతో) మా పెళ్ళి విషయంఅంతా మీకు తెలుసుగా- నేనంటే ఆయనకెంత

ఇష్టమో చెప్పండి-

రా :- చాలా! చిలుకాగోరింకల్లా ఉన్నారని వీధిలోవారంతా-

గి :- అనుకోరూ_ ఇప్పుడింకా అనుకుంటారు-

ప్ర :- మన సంసారంసంగతి పరాయివారిదగ్గర-

గి :- ఎందుకా- అవసరం వచ్చిందికాబట్టి- మీరు చేసిన మోసం ఇప్పుడే తేలిపోవాలికాబట్టి, ఒక్కసారి నిండు సంసారాన్ని కూల్చివేయడానికి పూనుకున్నారుకాబట్టి-

ప్ర :- ఆ- గిరీ! ఆ- ఏమిటామాటలు- పరాయి వారెదురుగుండా-

గి :- ఎవరు పరాయివారు- గ్రామనాథంగారా- మనకెంత ఆప్తులు- మన సంసారంఅంటే ఎంత ఇష్టం-

ప్ర :- అహా! అందుకని- ఈకారుకూతలు-

గి :- నావి కారుకూతలా- మీరు చేసినవి మంచివా- ఇంత ఘోరం-

ప్ర :- అంతఘోరం నేనేంచేశాను.

రా :- ఏమిచేశాడో చెప్పేయండి-

గి :- మీకు తెలియనట్లు- ఏంచెప్పను- చెప్పాకుంటే సిగ్గుచేటు. ఇంత బ్రతుకుబ్రతికి ఇంటివెనకాల చచ్చినట్లయింది-అయ్యో! (చేతిని నొసటమీద పెట్టుకొని కుర్చీలో కూలబడుతుంది)

ప్ర :- (దరికివచ్చి నిలబడి) గిరీ! శాంతించు- నేనేమిఘోరం చేశానో- చెప్పరాదూ అలా బాధపడకపోతే-

గి :- ఏమీ తెలియనట్లు మాటాడకండి- నాకప్పుడే ఎక్కడ

లేని కోపం వస్తుంది (లేచి) కావలిస్తే రామనాథంగారిని అడగండి.

రా :- (బిత్తరపోయి) నన్నా !

ప్ర :- ఇతగాడి కేం తెలుసు.

గి :- అంతా తెలుసు.

ప్ర :- (వెనక్కితగ్గి) ఆ- నేను చేశానంటున్నా ద్రోహంసంగతా

గి :- ఆ- ఆయనెంత మంచివాడు (రామనాథాన్ని చూపుతూ) పాపం ఇన్నాళ్లు ఏమో అనుకున్నా. ఇప్పుడు తెలిసిపోయింది- అందుకనే అంటారు, నిజం నిలకడమీాదగాని తెలియదని.

ప్ర :- ఏమి తెలిశాయో చెప్పరాదూ చంపక-

గి :- ఈ నక్కవినయాలు చాలించండి-

ప్ర :- ఆ- నక్కవినయాలు- గిరీ! జాగ్రత్త- ఎవరితో మాటాడుతున్నావో తెలిసికొనే మాటాడుతున్నావా- (మీాదికి వస్తాడు).

గి :- ఆ- నేనేమీా ఇతర వ్యామోహంలోపడి కొట్టుకోవడంలే-

ప్ర :- (తగ్గి) ఇతర వ్యామోహం !

గి :- అలా అయ్యారే- ఇప్పుడు తెలిసిందీ !

ప్ర :- నాకేమీా తెలియచే (రామనాథంతో) ఏమిటిదంతా రామనాథం?

రా :- నాకేం తెలుసు-

ప్ర :- నీకు తెలుసు నంటున్నది మాఆవిడ.

గి :- ఆయనకంతా తెలుసు- మీా సంగతంతా తెలుసు-

ఆయనే నన్నాదుకోకపోతే ఈవేళ- నా సంసారం- నా జీవితం నట్టేటిలో కలసిపోయేది-

ప్ర :- అంతగా నీజీవితం నట్టేటిలో కలవడానికి నాకు తెలిసి నంతవరకు నేనేమీ ద్రోహం చేయలేదే- (రామనాధంతో) ఏమిటోయి ఇదంతా? నాసంగతంతా నీకు తెలుసునట- (దగ్గరకువచ్చి) ఇక్కడచేరి ఏదో నాటకమాడుతున్నట్లున్నావే- చెప్పు ఏమిటో.

రా :- నేనా- నేనా-

ప్ర :- ఆ- నీవే- నీకన్నీ తెలుసునటగా- చెప్పు- చెప్పకపోతే నన్నెరుగుదువుగా- (మీదికి వస్తాడు).

రా :- (వెనక్కి తగ్గుతూ) ఆ! ఆ!

ప్ర :- (తలుపు కడ్డంగా నిలబడి) చెప్పవే- చెప్పకుండా ఒక్క అడుగు కదలనీయను.

రా :- నామీదకు వస్తావే అలా- నాకేం తెలుసు- మీఆవిణ్ణే అడుగు. ఆవిడే చెప్పుతుంది-

ప్ర :- గిరీ! ఏమిటీ ముసుగులో గుద్దులాట. నేనేంచేశానో చెప్పరాదూ?

గి :- (లేచి రామనాధంతో) చూశారండీ- నేను చెప్పాలట వారేమిచేసింది- (భర్తకేసి తిరిగి) అయితే ఈ ఉత్తరం మీకెవరు వ్రాశారో చెప్పుతారా దయచేసి (ఉత్తరంఇస్తుంది)

ప్ర :- ఏఉత్తరం?

గి :- ఇదే.

ప్ర :- నాకీమధ్య ఏఉత్తరాలు రాలేదే! (తీసికొంటాడు)

రా :- (విస్తుపోతూ ఆందోళన పడతాడు)

ప్ర :- (ఉత్తరం విప్పిచూచి) నాకీఉత్తరం అసలు అందలేదే- ఎవరు వ్రాశారుచెప్మా?

రా :- క్రింద సంతకం చూడు.

గి :- (సంతకంకేసి చూచి) సుశీల- సుశీల (ద్వారంకేసి చూస్తారు)

గి :- సుశీల ఎవరో తెలుసాఅండి.

ప్ర :- (గదికేసి చూస్తాడు)

గి :- అదికాదండీ ఎవరో తెలుసాఅండి.

ప్ర :- ఆ!

రా :- ఉత్తరంలో ఎవర్ని సంబోధించి ఉంది?

ప్ర :- నన్నే

రా :- మరి- (గిరిజకేసి చూచి నవ్వుతాడు)!

గి :- అబ్బాయిగారి బండారం బయట పడింది.

ప్ర :- (తీవ్రంగా) గిరీ! ఈఉత్తరం నేను చూడలేదంటే నమ్మ

రా :- పచ్చి అబద్ధం.

ప్ర :- నోరు మూయి. (గిరిజతో) అసలు నాకందనే అందలేదా ఉత్తరం- నమ్మవా నామాట.

గి :- నమ్మాను కనుకనే మిమ్మల్ని పూర్తిగా- ఇలాచేశారు!

ప్ర :- ఏంచేశాను?

రా :- ఏంచేశానంటావేమిటోయి నెమ్మదిగా- గిరిజ నిన్నేం

తగా ప్రేమించి పెండ్లిచేసికొన్నదో మాకందరికీ తెలిసేదూ అటువంటప్పుడు ఈ ప్రణయలేఖలు– ఈ రహస్యవ్యాపారం- నాకసలు నచ్చలేదుసుమా–

గి .– అలా గట్టిగా అడగండి– నావేపువారెవరూ లేరని ఇలా ఆడిస్తున్నారు చూడండి– ఎంత ద్రోహమో.

రా :– ప్రత్యక్షంగా నిదర్శనం కనిపిస్తుంటే, లేదంటేపోతుందా!

ప్ర :– గిరీ! నేనబద్ధమాడనని నీకు తెలుసు- ఏరహస్యంఉన్నా నీకు దాచనని తెలుసు– అయినా నామాట నమ్మడంలేదు- ఆఅమ్మాయి మన పెళ్లికిముందే 'ఉత్తరాలు వ్రాయడం మానేసింది. కావలిస్తే ఆ అమ్మాయినే అడుగు.

రా :– ఏదీ–

గి :– ఎవరు.

రా :– సుశీల.

గి :– ఇక్కడెక్కడ– మమ్మల్ని చూచి మీరూకూడా భ్రమిస్తున్నట్లున్నారే (భర్తతో) చేసినపని ఒప్పుకుంటే కొంత తీవ్రత తగ్గుతుంది. ఏమంటారు రామనాథంగారు–

రా :– అంతే! అంతే!

ప్ర :– ఏమిటోయి అంతే– అంతే (మీదికివెళ్లి) నిన్ను నోరు మూయమన్నానా– గిరీ! నేనాఉత్తరంసంగతి ససేమిరా ఎరుగను– అయినా వీడిముందు నన్నిలా–

గి :– వీరిముందే తేలాలండీ.

ప్ర :– ఆ!

గి :- అయితే- మీకీఉత్తరం రాలేదని దబాయిస్తున్నారు-
నాకెలావచ్చిందండీ- ఈఉత్తరం (అని ఉత్తరం అడిస్తుంది)
ప్ర :- అదే పరమాశ్చర్యంగాఉంది. నేను లేనప్పుడుగాని-
గి :- అదేమీ కాదండి. మీ పేర కాక C/oకి తెప్పించుకొన్నారు.
ఏంనటిస్తున్నారండి- మీరు నిన్న సాయంకాలం బజారులోంచి
వెళ్తూ జేబురుమాలు తీసుకొంటుండగా ఈఉత్తరం
స్వయంగా మీ జేబులోంచి పడింది-
ప్ర :- (విస్తుపోయి) ఆ! నా జేబులోంచి- ఉత్తరం. C/o గా
తెప్పించుకున్నానా!
గి :- అంతేకాదండీ రామనాథంగారు-
రా :- (నోరు తెరుస్తాడు)
ప్ర :- రామనాథానికేం తెలుసు.
గి :- ఆయనకంతా తెలుసు- అందుకనే ఆయనముందే తేలా
లన్నాను-
ప్ర :- ఏమోయి రామనాథం-
రా :- (బిక్కమొగం వేస్తాడు)
గి :- వినండి ఇంకా- అలా క్రిందపడిపోయిన ఉత్తరాన్ని తీసి
మిమ్మల్ని పిలిచారట పాపం- ఎంత పిలిచినా పలక్కుండా
వినిపించుకోకుండా వెళ్లిపోయారట- అంతేకాదండి రామ
నాథంగారు-
రా :- ఆ- ఆ!
గి :- మీకెందుకంత కంగారు రామనాథంగారు.

ప్ర :- రామనాథం-

గి :- అప్పుడేమిచేస్తారు పాపం ఆయన- తిన్న మనయింటికి వచ్చి- నాకిచ్చి-

ప్ర :- ఆ-

గి :- మీరు పారేసికొన్న ఉత్తరాన్ని నాకిస్తే జాగ్రత్తగా మీకప్పచెప్తానని- అంతేకదండి రామనాథంగారు.

రా :- అంతే అంతే!

ప్ర :- (ఆలోచనలోపడి నిట్టూరుస్తాడు)

గి :- పాపం- రామనాథంగారు మనకెంత ఆప్తుడు- ఉన్నదంతా విపులంగా చెప్పి- నన్ను జాగ్రత్తగా మసలుకోమని- ఇలాంటివి అందరి జీవితాల్లో సంభవిస్తుంటాయని నచ్చజెప్పి- ఉద్రేకంపాలు కావద్దని బోధించి- లేకపోతే- మన సంసారం నట్టేటిలో కలిసిపోతుందని సలహాయిచ్చి- వెళ్లి-మళ్ళీవచ్చారిప్పుడు మన సంసారం నట్టేటిలో కలవకుండా ఉందో లేదో చూచిపోదామని- మనమీదెంత వాత్సల్యమో వారికి-

ప్ర :- (నిట్టూర్చి) ఆ- ఇప్పుడు కొంచెం కొంచెం అర్థమౌతున్నది రామనాథం-

రా :- (తెచ్చుకున్న ధైర్యంతో) ఆ- ఏం

ప్ర :- ఈనాటకంఅంతా నీవాడించేనా ?

రా :- నేనా- నాకేంపట్టింది (గిరిజతో) చూచారా-

గి :- ఆయనకేం పట్టిందండీ- మనమీద ప్రేమచేత కాకపోతే-

రా :- అంతే- అంతే!

ప్ర :- ఈ అంతేలు చాలించి నాకు సమాధానం చెప్పు.

రా :- (జేబులో చేతులు పెట్టుకొని నిలబడతాడు)

ప్ర :- అయితే ఈఉత్తరం నా జేబులోంచి పడితే నీవు తీశానంటావు.

రా :- అయితే ఈఉత్తరం నాకెలాగవచ్చిందంటావు?

ప్ర :- (రామనాథం మెడదగ్గర చొక్కా-పట్టుకొని) నిజం చెప్పుతావా ? చెప్పవా ? ఇలా లేనిపోని ఉత్తరాల్ని కల్పించి నిండు సంసారాన్ని కూలద్రోయ దలచుకున్నావా?

రా :-నాకేంపని-నాకేంపని. ఏదో పాపం-

గి :-అవును పాపం-మన సంసారంమీద ప్రేమకొద్దీ-మీ జేబులోనించి పడిన ఉత్తరాన్ని-

రా :-అంతే-అంతే-

ప్ర :-ఆ సంగతే తేల్చుకోవాలి - చెప్పు న్యాయంగా చెప్పు. లేకపోతే (బల్లమీద రూళ్ళకర్రతీసి) ఇదిగో-దీనితో నీ తల-

రా :-ఆ! ఆ! చూశారా-

ప్ర :-నీవు నిజం చెప్పకపోతే నీ నెత్తురు కళ్ళచూస్తా ఈవేళ-చెప్పు! నిజం చెప్పు!

ప్రవేశం, (సుశీల చరచరా ప్రభాకర్రావు దగ్గరకు వెళ్ళి) ఆయనకాదు నిజం చెప్పడం-మీరు నిజం చెప్పండి (ఉత్తరం చూపి) ఈ ఉత్తరం ఎవరు వ్రాశారో.

ప్ర :-(రామనాథాన్ని వదలి) ఇదేమి ఉత్తరం ?

సు :-ఏ ఉత్తరమా-నన్ని ఊరువచ్చి 'సాయంకాలం పార్కులో

కలసికొమ్మని వ్రాశారే-మా సంసార జీవితం సుఖదాయకంగా లేదని జీవితంలో పొరపాటు చేశానని, నావియోగం సైప లేకుండా ఉన్నానని - వ్రాశారే ఆ ఉత్తరం-

ప్ర :-(ఆశ్చర్యపోతూ) నేను-నీకు-వ్రాశానా ?

సు :-నాకే! ఇదిగో ఉత్తరం (ఇస్తుంది.)

ప్ర :-నా జేబులోంచి లేని వుత్తరం పడటం - నేను వ్రాయని ఉత్తరం నీ కందటం-చిత్రంగా ఉంది-ఏదీ (ఉత్తరం తీసుకొని చూస్తూ) ఈ ఉత్తరం నేను వ్రాశానా - నీవు నమ్మావా గిరిజా-నా వ్రాత నీకు బాగా తెలుసుగా !

సు :-ఆ! వ్రాతమార్చి వ్రాయకూడదూ?-ఆమాత్రం చేత గాని వాళ్ళే మగాళ్ళు ఇంతాచేసి పైగా రామనాధంమీద విరుచుకుపడతారే- ఆయన మీ సంసారాన్ని నిలబెట్టడానికి చూస్తే! ఏమంటారు అక్కగారూ (గిరిజతో)

గి :-కాదుమరి.

రా :-మీరిక్కడి కెలా వచ్చారు. (ఆశ్చర్యంతో)

సు :-ఆ సంగతి తర్వాత ఆలోచిద్దాంగాని-నేనిప్పు డిక్కడకు రాకపోతే మీ నెత్తిమీద ఆ రూళ్ళకర్ర ఆదేశమయ్యేది - ఏమంటారు అక్కగారూ !

గి :-అందుకు సందేహమా!

ప్ర :-(బాగా నిదానించి చూస్తూ) ఈ ఉత్తరం నేను వ్రాశా నంటారు-

సు :-సంతకం చిత్తగించారూ!

ప్ర :-నాపేరే-మరి వ్రాత ?

సు :-వ్రాత మార్చి వ్రాయవచ్చు-ఎవరిచేతనైనా వ్రాయించ నూవచ్చు.

రా :-అంతే-అంతే-అపరాధం అంతా తనక్రింద పెట్టుకొని నా మీదెలా విరుచుకొని పడుతున్నాడో ప్రభాకరం, చూడండి.

ప్ర :-నోరుమూయి- (ఉత్తరం చూస్తూ) ఈ ఉత్తరం నేనే వ్రాశానంటారు ? ఈ మాటలు-ఈ భావాలు-ఈవ్రాత-నావే నంటావు గిరీ !

గి :-ఏమో మీ పేరుతో ఉంది.

ప్ర :-అవును-నా పేరుతోనే ఉంది-(ఆలోచిస్తూ) ఆ-ఉండండి- (డ్రాయరులోని ఉత్తరం తీసి పరికించి చూచి) ఇదిగో! ఈ ఉత్తరం-ఈ నా స్నేహితుడు కలెక్టరుగార్కి సిఫార్సు చేయ మని వ్రాసిన ఉత్తరం-ఇలారండి-ఈ ఉత్తరంలోని వ్రాత- ఈ వ్రాతతో పోల్చి చూడండి. (రెండు ఉత్తరాలు బల్లమీద పెట్టుతాడు.)

గి :-సు :-(బల్లదరికి వెళ్ళి వ్రాత పరికించి ఒకరినొకరు చూచు కొంటారు, చిరునవ్వు నవ్వుతూ) ఇప్పుడు తెలిసింది.

రా :-అమ్మయ్య తెలిసిందీ!

గి :-నే నుత్తరం చూడగానే చెప్పలే మా ఆయన వ్రాసింది కాదని.

సు :-చెప్పారు.

గి :-మీవా రెవరిచేతనైనా వ్రాయించకూడదా అని నన్ను అనుమానాల పాలుచేశారు-ఎందుకో మా ఆయన మీద విశ్వాసం - అయినా మీకు మావారి వ్రాత చూపిద్దామని - ఆయన వ్రాసిన ఉత్తరాలు తేవడానికేగా లోపలికి వెళ్ళాను- అంతలో-

సు :-ప్రభాకరంగారు వచ్చారు.

గి :-అప్పుడు మీ సంభాషణ విన్నాను-వచ్చేముందు త్తరం వ్రాయలేక పోయారా అని మావారు అడిగారు మిమ్మల్ని- మీరు వ్రాసిన ఉత్తరం సంగతి చెప్పడామా మానదామా అని ఊగిసలాడారు!

సు :-ఆ-ఆ-వ్రాశాను అందామని నా నోటిదాకా వచ్చింది- మీరన్నమాట జ్ఞాపకం రావడంచేత-సంభాషణ మార్చాను.

గి :-నేను గ్రహించా-మిమ్మల్ని రమ్మని మావారెందుకూరు వెళ్ళిపోవడం- మీకువ్రాసిన ఉత్తరంలో ౧/౦ వ్రాయమనడం- ఇవన్నీ చూచి మీరు వ్రాసిన ఉత్తరం వారికందలేదేమో- అసలు మీకు వ్రాసిన ఉత్తరంకూడా ఆయనది కాదేమో అని ఆలోచనలపాలయ్యాను-ఇదంతా తెరచాటునుండి ఎవరో నాటకం ఆడిస్తూన్నారేమో అని అనుమానించాను-అంతలో మా స్నేహితుడు జ్ఞాపకానికి వచ్చాడు-ఆ-అతని పాతచరిత్ర కూడా స్మృతికి వచ్చింది-నా అనుమానం రూఢి అయింది- కాని నిజం తేలడం ఎలా!

సు :-ఇంతలో రామనాథంగారు వచ్చారు-

గి :-ఆ-ఆయన మిమ్మల్ని పెళ్ళిచేసికోమని బలవంతం చేసిన సంగతి నా చెవిలో చెప్పారు-అదే విషయంలో నాచేతకూడా తిరస్కారం పొందారు కనుక-మనమీద పగచేత ఇలాచేసి ఉంటారేమో అనే భావనతో నాకు కలిగిన అనుమానం రూఢి అయింది. కాని, నిజం తేలడం ఎలా ? అంతలో నాలో మెరపులా ఒక భావం మెరసి ఈ నాటక మాడుదామని పించింది. ఆడాను. సూత్రధారుడు బయటపడ్డాడు !

ప్ర :-ఏమిటి మీ సంభాషణ ?

గి :-(నవ్వుతూ) మేమాడిన నాటిక ఇతివృత్తాన్ని ఒకసారి సింహావలోకనం చేసికొంటున్నాము. అన్నీ గాలికి విడిపోయే మబ్బుల్లా విడిపోయాయి (రామనాథం కేసి చూస్తుంది.)

ప్ర :-అయితే (సుశీలతో) నా పేరుతో ఈ ఉత్తరం(బల్లమీద తీసి) ఇప్పు డెవరు వ్రాశారంటారు?

సు :-(రామనాథం కేసి చూపుతూ) రామనాథంగారు.

రా :-ఆ-ఆ-నేనా-ప్రభాకరం పేరుతో నీకు త్తరం వ్రాశానా? నాకెందుకు మధ్య- బాగుంది !

ప్ర : అసలీనాటకానికి సూత్రధారుడు.

గి :- రామనాథంగారు.

రా :-ఆ-ఆ!

ప్ర :-ఆ-లేదు-ఈ-లేదు. రామనాథం (బల్లమీద ఇంకో ఉత్తరం తీసి చూపుతూ) ఇది ఎవరి ఉత్తరం ?

రా :-(చూచి) ఆ-ఇది నాదే!

ప్ర :-మరి. ఇంక బుకాయించక నిజం చెప్పు.

రా :-నాకేం తెలుసు. బాగుంది-నా వ్రాతలాసీవే వ్రాశావేమో?

ప్ర :-ఆ! ఆ! (మీదకు వచ్చి) ఇదోటి పైగా. నీ నీచత్వానికి అవధిలేనట్లుంది-అలా వ్రాయవలసిన అవసరం నాకేం వచ్చింది-ఇదంతా. (మెడదగ్గర చొక్కా పట్టుకోబోతాడు).

రా :-(తప్పించుకొని) ఆ-ఆ-నేనా వీరిద్దరు గూడుపుఠాణిచేసి-నామీద-

ప్ర :-ఏయ్ రామనాథం వెధవ డబాయింపు - నీవూను. ఇంకైనా నిజం ఒప్పుకుంటావా లేదా (మీదకు వెళ్లుతాడు.)

సు :-(వారి మధ్యకు వెళ్ళి) ఇంకా బుకాయిస్తావే-ఇన్ని నిదర్శనాలున్నా-ఇలా డబాయిస్తున్నావంటే మోసం చేయడంలో ఎంత ఘటికుడవో తేలిపోతున్నది. ఏనాటి కథావస్తువునో తీసికొని మాకు రంగులు పూసి రంగాని కెక్కించి రక్తికట్టించలేక రసాభాసం చేశావు. నిన్ను నిరసించానని నామీద పగ తీర్చుకోవాలని ఇంత పన్నాగం పన్ని వీరి సంసారంలో హాలాహలం కల్పించావు. నిష్కల్మషంగా ఒకరిని ప్రేమించిన హృదయం ఏనాటికైనా ఇంకొకరికి దత్తంకాదనే జ్ఞానం లేకపోయింది నీకు. నా మనోవేదనలో మ్రగ్గుతూ బ్రతుకు బరువుల బాటలో భారాతిభారంగా ప్రాణాలు వెళ్ళమార్చుకుంటున్న నన్ను రంగాని కెక్కించావు- పెళ్ళికాని పిల్లే-తల్లిదండ్రుల చాటుదే-ఊరుకాని ఊరే-అని భావించకుండా-

నా నీరసగుణాన్ని పురస్కరించుకొని ప్రభాకరంగారు వ్రాసి నట్లు వ్రాసి నాకాసలు రేకెత్తించావు. ఇన్నాళ్ళకు నాతపస్సు ఫలించింది గదా అని భ్రమించి నేను వ్రాసిన ఉత్తరాన్ని నీవే అందుకొని ప్రభాకరంగారి జేబులోంచి పడిందని బొంకి, గిరిజగారికి చూపించి నమ్మించి, ఆవిడ సంసారమంటే మహా ప్రేమగా నటించి కలహబీజాన్ని నాటి మొలకెత్తించి పుష్పింప చేశావు. ఆవిడ భర్తమీద అనుమానం పాలయింది. నీమాట నిజం కావడంకోసం సాయంకాలం పార్కులో ఎదురు చూస్తున్న నన్ను చూచిగావలసిందని పంపి ఆవిడ అనుమానాన్ని బలవత్తరం చేయదలచుకొన్నావు. ఇదంతా నీవు తెర వెనుకనుండి నాటకమాడావు. నా ఉత్తరం చూచి, నన్ను చూచి ఆమె మోసపోయింది. అన్ని నిదర్శనాలున్న తరువాత ఎవరు మాత్రం మోసపోరు- అంతవరకు నీనాటకం బాగానే రక్తి కట్టింది కాని మాకు ప్రకృతి సహాయం చేసింది-గాలీ వాన వస్తే కథే లేదంటారు. కాని మా కథ గాలివానతోనే ప్రారంభమయింది. ఆ గాలివానలో - ఆ సంజ చీకటిలో నన్నొంటిగా చూచి తన ఈర్ష్యాసూయలను దూరంచేసి స్త్రీ సహజమయిన జాలితో నన్ను వారింటి కాహ్వానించింది. అప్పటినుంచే నీ నాటికలోని కల్పనాసూత్రాల బిగి సడలిపో యొచ్చాయి. ఆమె నాలా ఉద్రేకురాలు కాదు. అంతా శాంతంగా ఆలోచించి చక్కగా ప్రవర్తించి నా కన్నులు విప్పి తన సంసారాన్ని చక్కబెట్టుకుంది. నీ వాడిన నాటకానికి

ప్రతినాటక మాడి, నీ నైజాన్ని, నీ నాటక కథావస్తువులోని బండారాన్ని బయటపెట్టింది. ప్రభాకరంగారి స్నేహమైనా లెక్క చేయకుండా నీ పచ్చిస్వార్థంకోసం సంసారాలూ- బ్రదుకులూ కూలద్రోయడానికి సాహసించే నీచుడవని నిర్ధారించింది. పో-ఇక్కడనుంచి-నీ ముఖంచూస్తేపాపం-లోకంలో సమస్త పాపాలు నీలో మూర్తీభవించాయి. నన్ను-నన్ను- నీ స్వార్థంకోసం - ఎంత అపహాస్యం పాలుచేశావు- నాకు ఎన్ని అగచాట్లు కల్పించావు- ఆ గాలివానలో- ఆగాఢాంధకారంలో వీరే నన్నాదరించకపోతే- ఈ ఊరుగాని ఊరిలో ఏమయిఉండును- అయ్యో! ఆడదే- అసహాయయే అని ఆలోచించావా- నీచుడా- (ఫడేలున లెంపమీద కొట్టి కుర్చీలో కూలబడి) అయ్యో! నీ స్వార్థంతో నన్ను అపహాస్యం పాలుచేశావు-నీచుడా! (నిట్టూరుస్తుంది).

రా :-(లెంప తడుముకుంటాడు. మాటాడడు.)

ప్ర :-(తలుపు తెరచి) మంచి శాస్తి అయింది. వెళ్ళు-ఒక్క నిమిషం యిక్కడ ఉండకు. నీసంగతి తెలిసిఉండీ, చిన్ననాటి చెలిమి పాటించి నిన్నింటికి రానిచ్చినందుకు మంచిపని చేశావు. ఇంట తిని, ఇంటి వాసాలు లెక్కపెట్టావు - ఛో - నావంతు ఆవిడే తీర్చివేసింది ఛో!

రా :-(కదలడు).

గి :-ఇంకెప్పుడు మా యింటికిరాక - నీ సంగతి తెలుసుండీ, మావారి స్నేహితుడవు కదా అని ఇంటికి రాని స్తే సంసా

నికి చిచ్చుపెట్టుతావా—ఒక అమాయక బ్రదుకు బగ్గంపాడు చేయ దలుస్తావా షో! (సుశీల దరికి వెళ్ళి తల నిమురుతుంది.)

రా :–(నిట్టూర్చి) వెళ్ళిపోతా—ఇంకెవ్వరికీ, ఎప్పుడూ కనిపించ కుండా వెళ్ళిపోతా–(సుశీల, గిరిజల దరికి వెళ్ళి) గిరిజా! క్షమించు–సుశీలా క్షమించు. ఇదంతా నేనే చేశా–ఇందులో ప్రభాకరాని కెంతమాత్రం ప్రమేయంలేదు. అతడు అమాయకుడు. మీ రిద్దరు నన్ను తిరస్కరించి నా జీవితాన్ని నిరాశా నిస్పృహలపాలు చేశారనేకోపం–దినదినం పెరిగి, పగగా మారి నా హృదయాన్ని కఠోరత్వంతో పొదివి నన్ను క్రూరుణ్ణిచేసింది, ఉచితానుచితాలు తెలిసికోకుండా, ప్రభాకరానికీ నాకు ఉన్న చిన్ననాటి స్నేహాన్ని కూడా పాటించకుండా పగతీర్చుకోవడమే పరమావధిగా పన్నాగం పన్నాను - (సుశీలతో) నీకు ప్రభాకరం అంటే ఎంత ప్రేమో తెలుసు నాకు. అందుకనే, అతడు వ్రాసినట్లుత్తరం వ్రాశాను నీకు. (గిరిజతో) అమె వ్రాసిన ఉత్తరాన్ని నీకు చూపించి–ప్రభాకరంమీద ఈర్ష్యాసూయలు రేకెత్తించాను. దీనితో ఇద్దరి జీవితాలు భగ్నమవుతవని నా పగ తీరుతుందని భావించాను - కాని - కాని అంతా అస్తవ్యస్త మయింది–నన్ను కోరగాకుండా - చూచి నన్ను నిరసించిన మీకు ప్రతీకారం చేద్దామనుంటే మీరే

నాకు ప్రతీకారం చేశారు—పవిత్ర పరిణయం ముందు ప్రతీకారం ఫలించదు—నాకు శాస్తి అయింది. (అని తల వాల్చుకొని నెమ్మది నెమ్మదిగా అడుగు వేసుకుంటూ నిష్క్రమిస్తాడు. గిరిజ, ప్రభాకరం గుమ్మందాకా వెళ్ళి తలుపు పట్టుకొని నిలబడుతారు. సుశీల కుర్చీలో కూర్చుండే అటుచూస్తూ నిట్టూరుస్తుంది).

తెర

సుజనరంజనీ ముద్రాక్షరశాల, రాజమండ్రి

## ప్రణేత



విద్వాన్. సహదేవ సూర్యప్రకాశరావు

రాజమహేంద్రవరం జన్మస్థలం. జననం 10-6-1908. విద్యార్థి దశనుండి వీరు కవిత్వ వ్యవసాయం చేస్తున్నారు. 1929లో శరత్ అరక్షణీయను ఆంధ్రీకరించారు. 1930లో మునిమాపు 1932లో వకుళమాల అను పద్యకావ్యాలు 1936లో ఆరాధన అనే కథల సంపుటి ప్రచురించారు. వీరి రచనలు భారతి, గృహలక్ష్మి, సూర్యప్రభ మున్నగు పత్రికలలో ప్రకటింపబడ్డవి వీరి నాటికలు, కథలు, పద్యాలు, విజయవాడ, మదరాసు రేడియో కేంద్రాలనుండి ప్రచారం చేయబడ్డవి.

తిమ్మరుసు, విషపాత్ర, పూజామాల, నర్తకి, కానౌ కళిగలి స్తే అనే నాటకాలు అనేక ఖండకావ్యాలు రచించారు. రాజమహేంద్రవర పురపాలక సంఘోన్నత పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులు.